"సమస్తమును మర్యాదగను, క్రమముగను జరుగనియ్యుడి"

1 కొరింథీ 14 : 40



ప్రథమ ముద్రణము ౧౦౦౦ ప్రతులు

1972 ఎపిఫనీ



ముద్రణ

విజయలక్ష్మి పవర్ ప్రెస్

గుంటూరు - 1

---

ప్రకటన

# ఆశీస్సులు

నిజమైన దేవుని గూర్చి తెలుపు గ్రంధరాజమే బైబిల్. ఇందు అరువదియారు పుస్తకములున్నవి. వీటన్నిటిలోను దేవుని శక్తి, ప్రభావము, కనికరము, పరిశుద్ధత, తేజస్సు బయల్పరచ బడుచున్నవి. కాని ఒక పుస్తకములో మాత్రము "దేవుడు" అను పదము కనిపించదు ఇది ఆశ్చర్యకరమే, కాని దీనిలో కనిపించే దైవ కరుణా కటాక్షములు, అత్యద్భుత సంరక్షణా విధానము అత్యాశ్చర్యకరము, ఈ పుస్తకమే బైబిల్‌లోని పదిహేడవ పుస్తకము– "ఎస్తేరు"

ఎస్తేరు చరిత్ర పురాతన పారశీక సామ్రాజ్య చరిత్రలో అహష్వేరోషు చక్రవర్తి పాలన నాటిది. "ఎస్తేరు" పర్షియన్ పదము. దీని భావము "నక్షత్రము". కాని ఈమె హీబ్రూ నామము హదస్సా (=పరిమళముగల చెట్టు) వాస్తవముగ ఈమె చరిత్ర అటు యూదుల చరిత్రలోను, ఇటు క్రైస్తవ సంఘ సంప్రదాయములోను ఒక నక్షత్రమై ప్రకాశించుచున్నది సౌందర్యముతో కలిసిన ఈమె నడవడి దైవభక్తి సుగంధ వృక్షమై గుబాళించుచున్నది. ఈమె పవిత్ర చరిత్ర నేకులు ఆయా సాహిత్య రీతుల ద్వారా అనేక భాషలలో ప్రపంచమున కందించియున్నారు.

ఈ త్యాగశీల ఎస్తేరు చరిత్రను "విజయశ్రీ" మకుటముతో రచించిన శ్రీ కొల్లూపాటి జేమ్సుకవిగారు ఈపనికి ఎంతయోసమర్థులు. అనుభవము, ఆదర్శము, ఆసక్తి వీరి రచనలలో కనిపించును. వీరి "సిలువధారి" బహుళ ప్రజాదరణ పొందినది, "విజయశ్రీ" కూడ విజయదుందుభి మ్రోగించి నాటక ప్రపంచములో అగ్రస్థానమును సంతరించుకొనవలెనని నా వాంఛ.

మున్ముందు శ్రీ జేమ్సుగారు ఇట్టి రసవత్తర నాటకముల నింకను రచించి క్రైస్తవ సాహిత్యమునకు, ప్రబోధ ఉద్యమమునకు వన్నె గూర్చునట్లు పరిశుద్ధాత్ముడు వీరిని దీవించునుగాక! శ్రీ జేమ్సు గారికి నా అభినందనలు, ఆశీస్సులు.

ఎపిఫనీ 1972 }
గుంటూరు }

(సం). ఎస్. డబ్లియు. శ్మితేనర్
అధ్యక్షుడు, ఏ ఇ ఎల్. సంఘము.

# శుభాకాంక్షలు

నటుడే రచయితయై మలచిన నాటకము రంగవిభజనలోను, రసస్ఫూర్తిలోను, పాత్రోచిత సంభాషణములలోను ఒక ప్రత్యేకతను కలిగి ప్రసిద్ధి గాంచుతుంది. ఆ ప్రత్యేకతను పుణికిపుచ్చుకొన్న నాటకము ఈ "విజయశ్రీ".

క్రీ. పూ. పారసీక దేశంలో పొడచూపిన జాత్యహంకారము దైవ భక్తుల త్యాగపూరిత సాహసముతో నశింపజేయుబడిన ఇతివృత్తమే ఈ విజయశ్రీ నాటకము.

ఇందు జెరక్సస్ మొర్దెకై, ఎస్తేరు, హామానులవంటి ప్రధాన పాత్రలతోపాటు ఇతర పాత్రల చిత్రణమును ఉదాత్తముగా సాగినది, సంభాషణములు పాత్రోచితముగ నున్నవి. హామాను అహంకార ఆశాసౌధం పేకమేడవలె కూకటి వేళ్ళతో కూలిన సన్నివేశ కల్పనలో చూపిననేర్పు అద్భుతము.

నాటక ప్రదర్శనమునకు పద్యము ప్రతిబంధకమని కొందరి అభిప్రాయము. కాని శ్రీ జేమ్సుగారు స్వయముగా నటకులు ప్రయోక్తలుగావుననే పద్యముల సంఖ్య తగ్గించుటయేగాక అవసరమగు పట్టులనే పద్యములను వాడి, ఔచితీ పాలనముతో రసస్ఫూర్తికెక్కువ అవకాశము కల్పించిరి.

పానుగంటి వారివలె దేశీయ ఛందములనే ఎక్కువ ప్రయోగించియున్నారు. అందుకొన్ని ప్రబంధకవుల ధోరణిలో నడచినవి.

వేడి గాడ్పుల తాకిడి పీడనమున
కలగి నిస్పృహాలూర్చెడు జలధరమ్ము
చల్లగాడ్పుల స్పర్శకు నుల్లసిల్లి
జల్లులను రాల్చకుండునా? క్ష్మాతలేంద్ర!

సంభాషణములకుప్రధానముగా వ్యావహారికము నే గ్రహించినను, చక్కని లోకోక్తులతో తెలుగు నుడికారపు సొంపులు సంతరించుకున్నవి.

ఇంతటి ఉత్తమ నాటకమును రచించిన శ్రీ కొత్రపాటి జేమ్సు గారికి భగవంతుడాయురారోగ్యైశ్వర్యములనిచ్చి సదా మనుచుగాత.

పెదనందిపాడు
16-1-1972

(సం) నల్లూరి వెంకట్రాయుడు యం.ఏ.,
(సం) విద్వాన్ ముప్పిపల్లి నాసరు,
ఆంధ్రాధ్యాపకులు. పి. ఏ. యస్. కళాశాల

# అంకితము



శ్రీ రమ్య ఉప్పుమాగ్లూరు నందుత్తమ
కీర్తి నార్జించిన గేస్తురాలు
సౌజన్య సౌశీల్య సచ్చరిత్రలుగల
కొర్రపాడ్వారింటి కోడలమ్మ
మంచు కొండల యెత్తు మించెడు శాంత స
ద్భావుండు పుట్టయు ధర్మపత్ని
సంగీత సాహిత్య రంగాల సత్కృతుల్
గొన్న రసజ్ఞుల కన్నతల్లి

కోయిలమ్మకు దీటైన గొంతుగలిగి
నమ్మ! మాయమ్మ! లక్ష్మిదేవమ్మ! నీకు
అంచితముగ నీ గ్రంథ మర్పించి భక్తి
నంజలిడుచుంటి ప్రేమతో నందుకొనుము.

# సుమనోంజలి

క్రీస్తు ప్రభువు కృపా విశేషంచే నా రచించిన మరో నాటకం ముద్రణ భాగ్యం నోచుకుంది. శిలువధారి నాటకం యెడ ఆంధ్ర క్రైస్తవలోకం చూపిన ఆదరాభిమానాలు నన్ను ముగ్ధుణ్ణిచేశాయి. పుస్తకాలు కావాలని కొందరు, ప్రదర్శించడానికి పర్మిషన్ యివ్వండి అని కొందరు, పఠించి భక్తి భావంతో పరవశించామని మరి కొందరు వ్రాసే అసంఖ్యాక లేఖలు నన్ను ద్విగుణీకృతోత్సాహిని చేశాయి.

ఓ క్రీస్తూ! నీకే మహిమా స్తోత్రాలు.

స్వార్థం తొలి కాపు కులం .. సర్వులూ సర్వేశ్వరుని సంతానమనే సత్యాన్ని చాటుకునేట్టి, ఒండొరుల మధ్య అడ్డుగోడలు కట్టి, అంతస్థులు సృష్టించి ఆనందిస్తుంటుంది కులం ... ఆ కుల పిశాచాన్ని కొలుస్తు, మరో కులాన్ని తన అధికార దర్పాలతో అంతం చేయ సంకల్పించాడో మంత్రి ఆ జాతినాయకుణ్ణి ఉరిదియ్యాలని ఏభై మూరల కొయ్య నాటించి, చివరకు ఆ ఉరికంబంపై తానే ఉరిదియ్యబడ్డాడు. ఆశ్రితుల కఖండ విజయాన్ని సమకూర్చిన అద్భుత, అనూహ్య దైవ సంకల్పమే ఈ విజయశ్రీ అను నాటకం.

శిలువధారి నాటకాన్ని నా పితృదేవులు కీ॥ శే॥ పుట్టయ్యగారికి సమర్పించుకొన్నాను. ఈ నాటకాన్ని నా మాతృదేవి శ్రీమతి లక్ష్మీదేవికి సమర్పించుకొంటున్నాను. నా కవితకు యింతకన్న పూజాఫలం యింకేం కావాలి? మాతాపితలకు ఈ కవితా కుసుమాలు సమర్పించుకొనే భాగ్యం నాజన్మకు కలిగించిన క్రీస్తునాథునికి కృతజ్ఞతాస్తుతులు.

శుభాశీస్సులు, శుభాకాంక్షలు అందించిన పెద్దలకు నా నమోవాకాలు .. ప్రదర్శకులు, ప్రేక్షకులు, పాఠకులు తమ అమూల్యాభిప్రాయాలందిస్తు, ఈ నాటకాన్ని కూడ ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

సెలవు
మీ కొర్రపాటి

# పాత్రలు

పు రు షు లు :-

1. జెరక్సస్ (అహష్వేరోషు) : పారసీక రాజ్య చక్రవర్తి . . . భోగలాలసుడు . . . కథానాయకుడు.

2. హామాను : ప్రధానమంత్రి.. అధికార దర్పం గలవాడు ... పరజాతి ద్వేషి. అమాలేకీయ వంశస్థుడు

3. మొర్దెకై : ఎస్తేరు పెద తండ్రి కొడుకు...రాజనగరు ద్వార పాలకుడు భక్తి గలవాడు...యూదుడు. .

4. మెమూకాను : ఆస్థానంలోని ఏడుగురు ఆచార్యులలో ఒకడు

5. మాంత్రికుడు : అష్టారోతు దేవి పూజారి

6. గిడ్డడు : మాంత్రికుని శిష్యుడు...పొట్టివాడు

7 తెరెషు :
8. బిగ్తాను : } షూషను కోటసింహ ద్వార పాలకులు . . . చక్రవర్తిని హత్యచేయ సంకల్పించిన వారు

9. బైరాగి : గ్రీకు గూఢచారి

10. 1 స్నేహితుడు :
11. 2 స్నేహితుడు : } హామాను స్నేహితులు.

స్త్రీ లు :-

1. ఎస్తేరు : పట్టపురాణి...యూదురాలు...తొలిపేరు హదస్సా.., కథానాయిక.

ఇంక, హర్బోనా, హేగే, హతాకు, అనుభటులు, తోటమాలి దుర్జయుడను ఖడ్గవీరుడు సందర్భాన్ని బట్టి వస్తారు.

# స్తుతి

శ్రీకర! కల్యాణమహిమో ప్ర
భాకర! క్రైస్తవ్య ప్రేమపారావారా!
నాకాధీశ్వర! విఘ్నని
రాకర! క్రీస్తు యేసు దేవరా! జయ జయహో!

రాగం: కళ్యాణి — తాళం: ఆదితాళం

జయ జయ జయ జయ యేసు దేవా! — త్రిశ్రగతి
జయ జయోస్తు! దివ్య భావా!

1. సకల జ్ఞానయుత శోభిత!
సర్వ కృపావర ప్రదాత!
నిఖిల లోక సంపూజిత!
నిరతస్తోత్ర సుర పరివృత!
దయసేయవే! అభయమీయ, దయామయా! ప్రేమనిలయ |జయ|

2. నిరుపమ భవదీయ ప్రేమ
చరితము విని తరియింపగ
వరుదెంచిన ఈ సభపై
పరిశుద్ధాత్మను కురియగ
దయసేయవే! దీవింపవే, దయామయా! ప్రేమనిలయ! |జయ|

౩. మా నాటక సమితి భవ
న్నామ కీర్తి ప్రకటించుచు
ఆంధ్రలోన అలరారగ
ఆశీర్వచనంబు లిడుచు
నడిపింపవే! నవపథాన, దయామయా! ప్రేమనిలయ! |జయ|

— : —

# విజయశ్రీ

## 1. రంగం

[నేపథ్యం నుండి]—...

అది క్రీస్తుకు పూర్వం నాల్గవ శతాబ్దం. పారసీక రాజ్య ప్రభావం భరతఖండం పొలిమేరల దాకా పరిఢవిల్లిన రోజు లవి.

ఆ ప్రఖ్యాతిగన్న పారసీక సామ్రాజ్యాధినేత జెరక్సస్ ! అతని నామాంతరమే అహష్వేరోషు.

నూట యిరువది యేడు సామంతరాజ్యాల కధినాథు డాసార్వ భౌముడు...సకలైశ్వర్య సంశోభితు డాచక్రవర్తి...సమరస భోగ లాలసు డాసామ్రాట్టు.

షూషను కోట వారి రాజధాని...ఆ కోటలో సామంతనృపా లురు, సైన్యాధీశులు, కాలజ్ఞానులు, పండిత ప్రకాండులు, నటులు, గాయకులు, విదూషకులు, నర్తకీమణులు, అవక్రపరాక్రమ విక్రమో త్తేజులు కూడిరాగా సంగీత సాహిత్యాది లలితకళాగోష్ఠులతో, పలు విధ ఆయుధ విద్యా పాటవాలతో ఆరు మాసాలు, ఆర్భాటంగా ఉత్స వాలు సాగాయి.

సకల పుష్పశోభితమై, దివ్య సౌరభవిరాజితమై ఓప్పు రాజో ద్యానవనాన విందులు సాగుతున్నాయ్ ... నేలకు దిగిన ఇంద్రధను వులా వ్రేలాడు పలువిధ వర్ణ ప్రకాశమాన యవనికలు, కనుల మిరుమిట్లు గొల్పు కాంతులు జిమ్ము స్ఫటిక శిలాఫలక వేదికలు, పసిడి వెండి జలతరు పాన్పులు, రత్నఖచిత రమ్యాసనాలు, గల అది పూల తోటయో, లేక స్వర్గ వాటియో?

బంగరు పాత్రలలో ఫలహారాలు, ఖచిత మాణిక్య కలిశా లలో మధురసుగంధ మద్యాలు సేవిస్తున్నారు. ఓహో హో! ఏం వైభవం! ఏం వైభవం!

ఆఁ! శ్రీగంధ వనంలో ముండ్లతుప్పలా వీడెవ్వడూ! ఖడ్గధారియై యుద్ధానికి సన్నద్ధమౌతున్నాడు. ఏఁవి టేఁవిటి? పేరు దుర్జయుడా? అయ్యో!... పారసీకుల ప్రతిష్ఠ భంగము కానున్నదా యేం?...

సెభాష్ : హామాను మంత్రి అతనితో క_త్తి కలిపినాడు.

[లోపల కత్తులు కలిసిన మోత వినపడుతుంది ]

ఓహో! ... అదీ! ... అదీ మంత్రివర్యా! బలమైన వ్రేటు వేశావ్ ! సెభాష్!... ఆఁ! ఆ వ్రేటును అతడెంత చమత్కారంగా తప్పుకొన్నాడు?... మొత్తంమీద కాకలు దీరిన బంటే!... అదిగో! ఆ వ్రేటుతో దుర్జయుడు బాగా విజృభించాడు. ఓహో! ఏమీ అతని లాఘవం!... చక్రవర్తినేగాక సభలోని యావన్మందిని చకితుల్ని చేసేస్తోంది. అతని ఖడ్గ కౌశలం!... అయ్యో! ... హామాను భుజంపై గాటు పెట్టినాడాదుర్జయుడు ... ఓహోహో! ... తోక త్రొక్కిన త్రాచులా మంత్రి విజృంభించాడు.

[హామాను, దుర్జయుడు పోరాడుచు తెరముందుకు వస్తారు. కొంతతడవు పోరాడిన పిదప హామాను దుర్జయుని క_త్తిని పడగొట్టి రొమ్ములపై క_త్తినుంచుతాడు. లోపలనుండి కరతాళధ్వనులు. తెర ప్రక్కలకు జారుకుంటుంది.]

-: రా జ ద ర్బా రు :-

[ముందే రాజదర్బారు సిద్ధంచేసి ఉంచాలి. జెరక్సెస్, మొమూ కానులు కూర్చుండి ఉంటారు. చక్రవర్తి యెడమ ప్రక్క ఆసనం ఖాళీగా వుండాలి.]

జెరక్సెస్ :- (పోయి హామానును కౌగలించుకొని) సెహభాష్ ! హామానూ! సెహభాష్! పారసీక ప్రభువుల ప్రతిష్ఠ నిలిపావ్. హంగులు రంగరించు మన వేడుకల భంగ మొనర్ప నరుదెంచిన ఈ దుర్జయుని శృంగభంగ మొనర్చి పారసీక దేశ ప్రతిష్ఠకు ప్రాణదాన మొనర్చావ్... సెహభాష్ ! రాజ్యమునందు నీకు ద్వితీయస్థాన మిస్తున్నాను.

హామాను :- (వంగి) ధన్యుడను.

జెర :- (దుర్జయునితో) ఓయీ! ఇక నెన్నడు ప్రగల్భాలాడకు,... తాడి నెక్కు వాడున్న తలదన్నువా డుండగలడు...పో!

దుర్జ :- (వంగి నమస్కరించి వెళ్తాడు.)

జెర :- సభాసదులారా! గగుర్పాటొనరించు జగజెట్టీల పోరాటాలు. తనువుల తత్తఱించు తళత్తళల కత్తిసాములు, కనురెప్ప వెంట్రుకల క్షణమున నుత్తరించు విలువిద్యలు, రాల్లరిగించు గానాలు, మహత్తర కావ్యపఠనాలు, అత్యంత మనోహర నృత్యాలు కలిగి అనుపమ ఆహార పానీయాలతో ఆరు మాసాలు ఆనందదాయకంగా గడిచిపోయాయి. ఇయ్యాది కడపటి దినం. ఈ సంతోష సమయాన మాకేదో కొంతలోపం కన్పడుతోంది.

మొమా :- (ఆశ్చర్యంగా) ప్రభువులకు లోపమా?

జెర :- (సాలోచనగా) అవును... (కొంచ మాగి) ఆఁ! ... స్ఫురించింది... మంత్రివర్యా! ఆ లోపమేదో వివరించగలరా?

హామా :- (లేచి, సభనవలోకిస్తు) చిత్తం ప్రభూ!

జెర :- సంశయం తీర్చమంటే సభను తిలకిస్తావేమయ్యా!

హామా :- ప్రభూ!

తే। గీ। విశ్వ విఖ్యాత వైభవోపేత మగుచు
నొప్పు కొలువున కొదువ నా కొకటి దోచె

జెర :- (బొమ లెగురవైచి ముసిముసిగా) ఏమిటో?

హామా :- ఖచిత నవరత్నమైన మీ గద్దె ప్రక్క
పట్టపుందేవి పక్షి లేనట్టి దొకటె!

జెర :- (సంతోషంతో) సెహభాష్! ప్రధానామాత్యునిగ నెంచు కొన్న ఘనత మాకుదక్కించారు. మా వామ పార్శ్వసింహాసనాన

పట్టమహిషి, నా ప్రియవష్టి లేనందున నా హృదయం, ఈ కొలువుకూటం నీ వన్నట్లు శోభవాసి యే కన్పడు తున్నయ్...
అవును. ఎందుకు కన్పడవు?

సీ॥ సరస విద్యాగంధ సంపన్న యయ్యును
సతత సవినయ జిజ్ఞాసి నెవరు ?
ఆగర్భ శ్రీమంతురా లయ్యు వినయమ్మ
బాయని గొనములు బంతి యెవరు ?
మంజులవాక్సుధామాధురి యయ్యును
పరుల భావల కీర్తి పరచు నెవరు?
భువనైక మోహనాద్భుతసౌరు కలిగియు
అహము కోడని పట్టమహిషి యెవరు ?

పతిని దైవంబుగా నెంచు పడతి యెవరు ?
దీనులను పుత్రులుగ చూచు రాణి యెవరు ?
అట్టి నా దేవి వష్టి లేనట్టి కతన
కొలువె యేమిటి? యీ యిలాతలమె వెలితి.

ఆహా!.. ఎంతటి వినయసంపత్తి. ఎంతటి భర్తృ భక్తి ... సకల విజ్ఞాన కోవిదులారా ! సభాసదులార ! నా పట్ట మహిషి వష్టి గుణ గణాల, రూపు రేఖల నెంతని వర్ణించను? (ఆలోచించి) వర్ణించు టే యేల? తప్పక నారాణిని మీ కెల్లరకు చూపుతాను.

(కాలింగ్ బెల్ కొట్టును)

హార్బోనా :- (వచ్చి నమస్కరిస్తాడు)

జెర :- సత్వర మేగుము...మణిమయ రాజమకుటం దాల్చి,సర్వాలంకారశోభితయై మహారాణి వష్టి నొకసారి కొలువునకు రమ్మనమని మాయాజ్ఞగా తెల్పి రమ్ము.

హార్బో :- (వంగి నమస్కరించి వెళ్తాడు)

హామా :- ప్రభువులు మన్నింతురుగాక మహారాణియు నంతఃపురాన రాచ కులాంగనలతో మనవలెనే విందులు వినోదాలతో

నున్నారుగదా. వారి విందున కంతరాయం కలుగునేమో...
అదియునుగాక నూట యిరువది యేడుగురు సంస్థానాధీశులు
తదితరులునగు మద్యసేవితులైన ఈ పురుషుల చెంతకు మహా
రాణి వచ్చుట కిష్టపడునా?...అని...

జెర :- (అదోలా చూస్తు) ఆఁ...అని

హోమా :- సందేహంగా వుంది ప్రభూ!

జెర :- (నవ్వుతు) ఎంతమాట?

తే॥ గీ॥ వినయసంపత్తి యే రాణి అనుగు చెల్లి
సహన మే దేవి నేస్తమై సంచరించు
అట్టి యింతుల మేల్బంతి ఆజ్ఞ మీరి
సంచరించున? సచివర! సందియంబ?

(నవ్వి) మేము రమ్మనుటయు మా రాణి నిరాకరించుటయునా?
ఎంతమాట (కొంచెంతాగి) సచివాగ్రణీ! నీ తెలివి యిందులో
తెల్లవారిందేమయ్యా! అవును మంత్రివి కావచ్చు, రాజ్య
తంత్రాల నెరుగవచ్చు కాని అంతులేని ప్రేమతో గంతులు
వేయు ప్రణయుదంపతుల అంతరంగాలు గ్రహింప నీ కెట్లు
సాధ్యం? (నవ్వుతాడు)

మెమూ :- ప్రభువులు చక్కగా సెలవిచ్చితిరి.

హోమా :-(మెమూకానువైపు చురచుర చూచి తల వంచుకుంటాడు)

హార్బో :- (ప్రవేశించి) జోహార్!

జెర :- (చూచి) మాటల్లోనే వస్తోంది.

హార్బో :- (లేఖ నందిస్తాడు.)

జెర :- ఆఁ! ఏది? ... (అందుకొనుచు) ఓహో! సభాప్రవేశాను
మతికి లేఖ నంపినదా? చూచారా? ... చూచారా ? ...

మా రాణి వినయ సంపత్తి! పతిభక్తి! (విప్పుచు లేఖవైపు చూడకయే) సచివాగ్రణీ! ... ఆచార్యులారా! పల్లవ కోమల హస్తంతో (ముద్దుపెట్టుకొని) వెల్లుబుకు ప్రణయ సుఘల ముంచి లిఖించిన నాహృదయరాణి లేఖని యొరవడి నవధరించండి. (విప్పి చూచుచు)

"ప్రణయ సామ్రాజ్యాధినాథా! నాప్రాణనాథా!"

(ఉబ్బితబ్బిబ్బయి) ఆహా! యెంతటి ప్రణయామృత సంబోధన!

"అర్ధాంగినగు నన్ననుగ్రహించి ఆహ్వానం పంపినందులకు కృతజ్ఞురాలను"

"చూచారా? యెంతటి విధేయతో"

కాని . . (బొమలు ముడిచి) విందునకు రాజాలక పోయి నందులకు .... ఈదీనురాలిని .... ఈ ఒక్క పర్యాయం మన్నింప ప్రార్థన.

'మీ చరణదాసి'

'వష్తి'

(ఉగ్రుడై లేఖను నేలకు కొట్టి భటునిచూచి) ఫో! ...

హార్బో :- (గజగజలాడుచు వెళ్తాడు.)

జెర :- చరణదాసి ... కాదు నా పాలిటి రాకాసి! .... వష్తి కాదు. నా గౌరవం పాలిటి మిత్తి! .... ధిక్కారం! నూట యిరువది యేడు సంస్థానాల నేకచ్ఛత్రాధిపత్యంగ నేలు చున్న జెరక్సస్ చక్రవర్తి యాజ్ఞకు నేటికి ధిక్కారం!

అందరు :- (భయంగా చూచుచుందురు.)

హామా :- (లేచి వినయంగా) ప్రభూ! మహారాణిగారి ...

జెర :- (త్రాగుచున్న పాత్రను నేలపై గొట్టి) చాలు ... చాలు... ఏమియు తెల్పనవసరంలేదు. (నిట్టూర్చి) పరాభవం! నిందు

కొల్వులో పరాభవం! ... వినయానికి మారుపేరను కున్నాను. గుణాలకు నిలయ మనుకున్నాను. కాదు. మార్చు కొన్నాను ... అహంకారాని కాటపట్టు! ... నిర్లక్ష్యానికి నిలయం! విజ్ఞాన ధురంధరులారా! సభాసదులారా! శాస్త్రి లనేమి? జ్ఞానులనేమి? సామంతాది నృపాలురనేమి? తర్క శాస్త్ర పారంగతులనేమి? కవి గాయక నట విదూషకాది కళాసృష్టల నేమి! ఒక్క టడుగు చున్నాను. నిష్పక్షపాతంగా, నిర్భయంగా మాకు న్యాయం తీర్చండి.

అందరు :- (ఆశ్చర్యంగా ఒండొరుల చూచుకొను చుందురు.)

జెర :- పతియాజ్ఞను ధిక్కరించి పరాభవ మొనర్చిన పడతి కేం శిక్ష? (ఆచార్యుల నొక్కొక్కరిని) కర్షెనా! ... షెతారూ! ... అద్మాతా! ... తర్షీషు!... మెరెసూ! .... మర్సెనా! ... మెమూకానూ! ... ఆచార్యులారా! మాటాడ రేం?

హోమా :- (లేచి) ప్రభువులు మన్నింతురుగాక. మహారాణిగారి యుద్దేశం నెరుగక యే పరోక్షమున ఒక నిర్ణయానికి రావడం పాడిగాదని నా అభిప్రాయం.

మెమూ :- పరోక్షమున నున్న ప్రభువులవారి అనురాగాన్న వగతం చేసికొనలేక మహారాణి నిరాకరించుట పాడిగాదని నా అభి ప్రాయం.

జెర :- (త్రాగుచు) సెహభాష్! భర్త యాజ్ఞను తృణీకరించిన భ్రష్టమనస్వి వష్తి కేశిక్ష విధించాలో కూలంకషంగ విచా రించి తీర్పు నిచ్చుటకు మెమూకానాచార్యులకు సర్వాధికార మొసంగితిమి

మెమూ :- (లేచి) పారసీక ప్రభువులకు ప్రణామాలు! సభాసదుల కభివాదాలు! 'యథారాజా తథాప్రజాః' అని విబుధుల వాక్యం. కావున, యావదాసృష్టి ప్రజలదృష్టి ప్రభువుల

వారిపై నిరంతర ముంటుంది. అందుకే అఖిల ప్రజలకు ప్రభువు లాదర్శమూర్తు లనుట అతిశయోక్తిగాదు. అట్టి రాచకుటుంబంలో ఒక స్త్రీ అందున మహారాణి భర్తయాజ్ఞను తృణీకరించినదనివిని మహారాణి యాజ్ఞ మీరిన మహారాజు సమ్మతింపలేదా అని రాజ్యమునందలి స్త్రీలు పతిభక్తి విడనాడి సంచరింతు రనుటలో సందియంలేదు.

కావున, ఇయ్యది రాచకుటుంబ సమస్యగా కాక యావద్రాష్ట్ర సమస్యగా నెంచి తీర్మానిస్తున్నాను

రాజ్యమందలి స్త్రీలు భర్తల యెడల భయభక్తులు కలిగి మెలగవలయునన్న వష్తీరాణిని ప్రభువులు వెంటనే విడనాడవలెను. అంతమాత్రమేగాక ఈ విషయం పారసీక రాజ్యమంతట ప్రకటించుటకొక రాజశాసనాన్ని పుట్టించవలెను. అల్పులేమి ఘనులేమి దీనిని బట్టి భయభక్తులతో జీవించగలరనుట నిర్వివాదము.

మరియు భువనైక సుందరి నొకర్తును ప్రభువులకు పట్టమహిషిగా నేర్పాటు చేయవలయును.

జెర :- (లేచి) కాలజ్ఞానులగు ఆచార్యుల తీర్పు ననుసరించి వష్తిని నేడే విసర్జిస్తున్నాను... హామానూ ! మెమూకానాచార్యులు వచించినట్లు తాకీదులు వ్రాయించి ప్రతి రాష్ట్రమునకు పంపించుడు. (చరచరా లోని కెళ్తాడు.)

హామా :- ప్రభూ !

\- తెర -

# 2. రంగం

## : రాజోద్యానవనం :

[అది మహారాజు విశ్రాంతి తీసుకొనే పూసటీరం, తోటమాలి తోట బాగుచేస్తుండగా ఒక చిత్రపటం కన్పిస్తుంది.]

తోట :- (పటంకేసి ఎగాదిగ చూచి) అసలు మడిసే నని అదురు కున్నాను. (నవ్వి) ఆరమ్మా! ఇది బొమ్మ!... తస్సదియ్యా! ఏఁ వందగత్తా! ఏఁ వందగత్తా!.... ఈ రోజు ఈఁవె వంతు గావాల్సు... ఎవురొంతయితే యేం లాబం .. రాజ్జంలో ఉండ అందమైన అమ్మాయిల్ని బాగా సిద్ధపర్చి, రోజు కొకర్ని పంపి త్తుంటే ఆరి తస్సదియ్యా! ఒక్కర్నన్న లెక్కసేయక పోతుం డాడు.... లేస్తే వస్తి!.... కూసుంటే వస్తి!.... అంత బెమ గల్లోడు ఎందు కొదిలి పెట్టాల అంట.... ఆహాఁ, ఎందు కొదిలి పెట్టాల అంట ... ఇయ్యాల ఈఁ వెను మాత్రం సేర్చుకుంటా డని యెక్కడుంది? .. ఏదేఁ వైనా రోజూ కనిపిస్తన్న బొమ్మ లొక యెత్తు ఇదొక యెత్తుగావుంది. (ఆలోచించి) అయిన ఉడత కెందుకు ఊళ్లో వార్తలన్నట్లు, మాలికెందుకు మాలావు ముచ్చట్లు? ఆఁ అదెక్కడ మాట? మంచి చెప్పకోటానికి మాలేంది? మారాజేంది? అంతా ఆయన బెమగాని ఈఁవె ముఁదు వష్టి బలాదూర్! ఈఁ వెక్కడ? వష్టి యెక్కడ (బాల్చితో నీళ్లు పోస్తు) ఎంత అందం! ఎంత అందం! ....ఈఁ వెక్కడ? వస్తీ యెక్కడ? ఈఁ వెక్కడ?

(నేపథ్యంలో) జెర :- తే॥ గీ॥ ఔర! ఏమని నావుదురాత్మ! నీవు.

తోట :- (వణకుచుండగా వస్తువులు వాటంతటవే జారిపోతాయి) బాబోయ్: పె.... బు వు.... లు.

జెర :- అతుల శృంగారమయశోభితాంగి యైన
వష్టి సౌందర్యశోభకే వంక బెట్టు
చుంటివా? చీల్తు, నీ నాల్క ఉండు మచట?

(ఆటోపంతో ప్రవేశించి కత్తి దూయును)

తోట :- (వణుకుచు గద్గదస్వరంతో) ప్రభూ! నే నే మన లేదు.

జెర :- (కోపంతో) యేమియు నన లేదా ?

తోట :- అన .... లే .... దు

జెర :- వప్తిదేవి సౌందర్యా న్నధిక్షేపించ లేదా ?

తోట :- (దుఃఖంతో) అయ్యో! ... నేనా ? మా రాజుల ఉప్పు పులుసు తినే మాలిని ... ఈ పటం వెక్కడ ? ఆ మారాణి యెక్కడ ? నంటి అంతియే.

జెర :- అనగా నీ భావం ?

తోట :- మారాణి ముందు ఈ వెందుకు పనికిరాదని.

జెర :- (చిఱునవ్వుతో) అటులనా ? ... సరే ... (తోటమాలి పోతూవుండగా) ఆగు !

తోట :- (భయంతో వెనక్కు వస్తాడు)

జెర :- ఇదిగో ! (హారం యిస్తాడు)

తోట :- (అందుకొనిపోతూ, తనలో) అమ్మయ్య బతికి బయట బడ్డాను ఇందుకే రాజుల కొలువు కత్తిమీద కసరత్తురా, జాగర్తరా, అన్నాడు. మా అయ్య ... ఉపాయం లేనోడు ఇక్కడుండ లేదు .... ఇక్కడే గాదు యింకెక్కడ వుండ లేడనుకో, ... లేసిన వేళ మంచిది. అయినా .... మాలి కెందుకు మాలావు ముచ్చట్లు ? (పోతాడు.)

జెర :- (కొంచెం నడచి, ఆలోచన పూర్వకంగా) అకటా ! సంతత వసంతశోభాయమానమైన నా యీఉద్యానవనం ఏలకో చిన్నబోయి కన్పడుతోంది.

సీ॥ పులకించు పరిమళా లొలుకుచు తిలకించు
చిన్న గులాబీల కన్నెలార!
తరుణార్క ప్రియుని సందర్శించి నవ్వులు
విరిసెడు తోయజ తరుణులార!
దరసిత వదన సౌందర్యమ్ముచే వనం
బెల్ల హసించెడు మల్లెలార!
ఝుమ ఝుమ స్వనములు సొంపిల పూబూవు
తిరుగుచు పాడెడి తేటులార!

బంతి చామంతి మందార బాలలార!
పూల గంధాన సోలు ఓ గాలులార!
అలిగి నారేల కన్నెర్ర కలిగె నేల?
కినిసి అరగంటితోడ వీక్షింతు రేల? (కొంచెం నడిచి)

పూల కన్నియ లేగాదు. అవిగో! కోయిల దంపతులు. వసిష్ఠకి ద్రోహం మొనర్చి ఒంటరిగా వచ్చితినని కాబోలు. 'కుహూ కుహూ' రావాల మాని వేశాయి. (కొంచెం నడిచి) ఇదిగో! మయూర నిలయం! ఏమది! వివిధ నృత్య భంగిమలతో ఎదురరుదెంచు మయూరాలజంట పొదరింటి నుండి బయటకు రాదేల?.... అదిగో! చిలకలజంట కిలకిలా రావాలచే యెక్కడికో పరుగిడుతున్నయ్. ఈ ఉద్యానవనాన ఒక పత్నీవిద్రోహి సంచరిస్తున్నాడని కినుక వహించినయ్ .... కాబోలు ఈ జంట లన్నియు ఒంటరిగా నున్న నన్ను పరిహసిస్తున్నయ్ ఆలోచిస్తే ప్రపంచ మంత జంటల పంటగ తోస్తుంది. (నిట్టూర్చి) నేను మాత్రం ఒంటరినై పోయాను. (వేదికపై కూర్చుండి అక్కడ వున్న పటాన్ని చూస్తూ వుంటాడు.)

[నేపథ్యంలో సన్నగా స్త్రీ కంఠం.]

పాట :- "రాజా! ... ఓ నారాజా!
నేర మేమి చేయని నను
దూర మేల చేసితిరి ... ఓ నారాజా! నారాజా!"

జెర :- వసిష్ఠీ!

హేగే :- (ప్రవేశించి) జయం మహారాజా !

జెర :- (సంబాళించుకొని, ప్రశ్నార్థకంగా చూస్తాడు.)

హేగే :- మెమూాకానాచార్యులు, ద్వారం చెంత వేచియున్నారు.

జెర :- ప్రవేశ పెట్టు.

హేగే :- చిత్తం. (పోతాడు.)

[మెమూకాను వస్తాడు .. చేతిలో గ్రంథపుచుట్టలు వుంటయ్]

మెమూా :- (వస్తు) ప్రభువులకు జయం !

జెర :- మంచిది. అటు కూర్చుండుడు

మెమూా :- (కూర్చుంటాడు.)

[ క్షణం విరామం ]

మెమూా :- ప్రభూ!

జెర :- (చూస్తాడు.)

మెమూా :- గ్రంథ పఠనం ప్రారంభించనా ?

జెర :- ఎంతవరకు చదివాం ?

మెమూా :- ప్రథమ ప్రకరణం పూర్తయింది.

జెర:- హుం హుం .... ప్రథమ ప్రకరణం పూర్తయింది. .... నా ప్రణయ జీవిత గ్రంథానకూడ ప్రథమ ప్రకరణం పూర్తి యింది ....ఆచార్యా ! ఇంతకు ద్వితీయ ప్రకరణ ముంటుందా?

మెమూా :- తప్పక ప్రభూ !

జెర :- ఏమో ....

మెమూా :- అనుమాన భయాలకు రాజకీయ మతీతంగా వుండాలి, అను నీతిని నిన్నటి దినం చదివాం. మరచారా ప్రభూ !

జెరు :- (నిటూర్చి) కాని ..

మెమూ :- మన్నింతురుగాక. అంతఃపురాధిపతి 'హేగే' చే అలంకృతులై దినమున కొక్కొక్కర్తు వంతున తమ చెంత కరుదెంచు సుందర యువతులం దొక్కరినైన ....

జెర : (నవ్వి) వారు సుందర యువతులు గారు ఆచార్యా !

మెమూ :- కాకపోవచ్చు .... ఇంతకు ప్రభువులు వారి అందచందాలు తిలకించు చందంలో లేరు వష్టీదేవి వియోగ చింతా రసంతో నిండిన మీ హృదయ భాండంలో తదన్యుల సౌందర్యామృతం చొరడానికి తా వెక్కడుంది ప్రభూ !

జెర :- (పరధ్యానంలో చిఱునవ్వు నవ్వుతాడు.)

మెమూ :- నిరంతరం మీ ఆలోచనలు పరాయత్తమై ఉండుటచే పరిపాలనాదక్షత కొరవడుతోంది దీక్ష లేని కార్యం దక్షత నొందదుగదా



జెర :- (పటం వైపు చూస్తూ) నిజంగావచ్చు

మెమూ :- (రాజు పటాన్ని దీక్షగా చూడ్డం గమనించి) పొరబడితిని. ప్రభూ !



జెర :- (ఆశ్చర్యంగా) ఎందుకు ?

మెమూ :- మీ దీక్ష కొరవడ లేదు.

జెర :- ఎట్లు ?



మెమూ :- వచ్చినదాది గమనిస్తున్నాను .... తమ దీక్ష ఆ చిత్ర పటాన లగ్నమై వుంది.

జెర -: (మందహాసంతో) అంతమాత్రాన,

మెమూ :- తెల్పమందురా ? ఆ చిత్తరువులోని మత్త కన్నియను పొత్తుకొనుటకు ప్రభువులచిత్తం ఆయత్త మవుతోంది.

జెర :- (వాక్యం ముగియక మునుపే బిగ్గరగా నవ్వును)

మెమూ -: (సంతోషంగా) ఆహా ! ప్రభువుల ముఖ కమలం ఎన్నాళ్ళకు వికసించింది .... మా రాజ్యాని కిదే సుప్రభాతం

జెర :- ఆచార్యా !

మెమూ : ప్రభూ !

జెర :- (పటం చూస్తూ) ఈ కన్యకయందు, ఏవో అనన్య శాంతి కాంతులు స్ఫురిస్తున్నయ్ గదూ.

మెమూ :- (చూచి) చిత్తం .... బాగుగా గమనించారు .... ఈ చంద్ర వదన వదనంలో వినయ విధేయతా చంద్రికలు ప్రజ్వరిల్లు తున్నయ్ .. ఇకనైన ప్రభువులు ద్వితీయ ప్రకరణం ప్రారంభిస్తారా ?

జెర :- (నవ్వి) పటమును చూచి పడతిని వరించుటా ? తమరు జ్ఞానులు .... ఇందులో చిత్రకారుని ప్రతిభ యొందుకుండ గూడదు ?

మెమూ :- వాస్తవాలు చిత్రించు సిద్ధహస్తులగు కళాసృష్టలు లేర నియా తమరి అభిప్రాయం ?

జెర :- కళాకారుల నపార్థం చేసికొంటినవియా మీా వాక్య భావం. లేదు .... వారి ప్రతిభ నుగ్గడించా నంతే.

( తెరలో బాకానాదం )

అదిగో ! అసలు ప్రతిమయే అరుదెంచుతోంది. ఇక ఈ చిత్ర పటాన్ని గూర్చిన చిత్ర విచిత్ర వాదా లేల ?

మెమూ :- చిత్తం .... ఈ అర్థశాస్త్ర గ్రంథపఠనంలో ద్వితీయ ప్రక రణం వాయిదా వేసినను, తమ ప్రణయ జీవిత గ్రంథంలో ద్వితీయ ప్రకరణం ప్రారంభించండి ప్రభూ !

జెర :- (మెల్లగా నవ్వుతాడు.)

మెమూ :- (లేచి) శీఘ్రమేవ కళ్యాణప్రాప్తిరస్తు! సెలవు దయచేయండి ప్రభూ !

జెర :- మంచిది,

మెమూ :- (పోతాడు)

(రెండవసారి బాకానాదం)

[పూర్తి మేలిముసుగుతో నున్న ఒక కన్యను (ఎస్తేరు) హేగే అను భటుడు పట్టకొని తెచ్చి నిలిపి, రాజుకు నమస్కరించి వెళ్తాడు]

జెర :- (మెల్లగా దగ్గరకు వస్తాడు)

ఎస్తేరు :- (మోకరిస్తుంది)

జెర :- (దండంతో ముఖంపై ముసుగు తొలగిస్తాడు)

ఎస్తే :- (సిగ్గుతో తలదించుకుంటుంది)

జెర :- (మెల్లగ పైకి లేపుచు) పేరు ?

ఎస్తే :- (భయకంపితు రాలౌతూ వుంటుంది)

జెర :- వణకుతున్నా వెందుకు ? .... ఇందెవ్వరు లేరు నిర్భయంగా చెప్పు.

ఎస్తే :- (మెల్లగా) హదస్సా !

జెర :- హదస్సా ! హదస్సా .... కోరితే ఆభరణాలు కో కొల్లలు మరి ఒక సామాన్యురాలివలె వచ్చావేం ?.... హేగే నీకు వాటి నిచ్చియుండ లేదా?

ఎస్తే :- మన్నింతురుగాక .... నే నే వాటిని కోరియుండ లేదు.

జెర :- కారణం ?

ఎస్తే:- నే నొక సామాన్యురాలి నగుట.

జెర :- (మందహాసంతో) కావచ్చు. కాని, ఈ నాడు పట్టమహిషీ పరీక్షకు నిల్చిన అభ్యర్థినివిగదా .... అనేక రకాల ఆభరణాలు దాల్చి, అందాల్ని పెంపొందించుకొని మహారాజుల డెందాన్ని హరించాలనే వాంఛ నీకు లేదా ?

ఎస్తే:- ప్రభూ! ... అందం ఆభరణాలను బట్టి రాదుగదా .... అదియునుగాక, ప్రభువులు కళామూర్తులు. కృత్రిమంకన్న సహజత్వాన్నే యెక్కువ ప్రేమిస్తారని నా యభిమతం.

జెర :- ఓహో! నా అంతర్యాన్నే అవగాహన చేసికొన్న ధీమంతు రాల వన్నమాట .... ఒకమాట ?.... నేను కృత్రిమాన్ని కాంక్షించనని భావమలు ధరించలేదు .... కాని సహజంగా వాటిపై నీకు మమకార ముందిగదా.

ఎస్తే :- మమ్మాటికి లేదు ప్రభూ! ... క్షమింపుడు. జన్మతః నే నొక సామాన్యురాల నని తమకు ముందుగనే విన్నవించుకొంటిని.

జెర :- (కోపం నటిస్తు) సామాన్యురాలు! ... సామాన్యురాలు! పారసీక ప్రభువుల పట్టమహిషీ యోగ్యకు ఒక సామాన్యు రాలు. (బిగ్గరగా) ఎవ రక్కడ ?

హేగే :- (వస్తాడు)

జెర :- (కోపంతో) ఈమెను వెంటనే తీసికొని పో.

హేగే :- చిత్తం (ఎస్తేరును మెల్లగా తీసుకొని పోతూవుంటాడు.)

జెర :- ఆగు (భటుని వెళ్లుమని సైగ చేస్తాడు )

హేగే :- (పోతాడు)

జెర :- భయపడితివా ?

ఎస్తే :- (నిబ్బరంగా) లేదు ప్రభూ !

జెర :- కారణం ?

ఎస్తే :- ఇంతవరకు తమ ప్రేమాదరాలకు నోచుకొనలేని వందలాది మంద భాగ్యులైన కన్యల కంటె నే నెక్కుడుదాననని తలంచక పోవడమే.

జేర :- మాటల్లోనే మహిళామణుల పతాన మహారాజున కొక హెచ్చరిక ! .... మంచి తెలివి ! హదస్సా! మీ దేజాతి ?

ఎస్తే :- అన్ని జాతుల కధినాథులు మీరు జాతితో .....

జేర :- (వెంటనే) అవసరంలేదు .... గణనీయమైన వినయం! వినయానికి తగిన వివేకం ! .... అన్నిటిని మించిన అందం సెహాభాష్ ! .... హదస్సా ! నీ పేరిక హదస్సా కాదు. చిమ్మ చీకట్లు క్రమ్ముకొన్న నా హృదయాకాశాన్ని వెలిగించిన తారవు. కనుక నీ వేక ఎస్తేరువు నీవే ఈ యావదాష్ట్రానికి పట్టమహిషివి .... నాకు తగిన ధర్మపత్నివి .... ఎవ రక్కడ ?

హేగే :- (వస్తాడు)

జెర :- లేఖనీ తూలికను, పత్రమును, గొసరమ్ము.

హేగే :- చిత్తం (పోయి ఈక కలమును, లేఖచుట్టను తెచ్చి యిస్తాడు)

జెర :- (ఏదో వ్రాసి, ముద్రిక నద్ది యిస్తు) ఇది హామాను మంత్రికిమ్ము.

హేగే :- (నమస్కరించి వెళ్తాడు.)

జెర :- ఏమో వ్రాశామని భయపడుతున్నావా? (చిలిపిగా) ఓహో! మరచితిని. నీకు భయం లేదంటివిగదూ. అయినను అనురాగ దాంపత్యాన అనుమానాలు అతిరహస్యాలు ఉండవు. ఉండకూడదు. (దగ్గరగా తీసుకొనుచు) ఇటు రా.

తే. గీ. ప్రణుత షూషను కోట విరాజమాన
మగుచు మంగళ తూర్యరావాలు సెలగ
మంత్రి సామంత నృపజన మధ్యమందు
ఎల్లి నిను పెండ్లియాడంగ నెంచినాడ.

అనుచు వ్రాశాను.

ఎస్తే :- (రాజు పాదాల దగ్గర మోకరిస్తు) ధన్యురాలను.

- తెర -



# 3. రంగం

## : షూషనుకోట సింహద్వారం :

[తెరెషు, బిగ్తాను అను ద్వారపాలకులు పహారా తిరుగుతు ఉంటారు.]

తెరెషు :
బిగ్తాను : } - హారా హుషార్ ! ... హారా హుషార్ !

(లోపలనుండి మొర్దెకై పాట వినపడుతుంది. ఇరువురు సంజ్ఞ చేసికొని ఆ వైపు చూస్తారు )

పాట :- అనుబంధం-1

తెర :- ఏయ్ ! ఆగు యెక్కడికి ?

బిగ్తా :- ఇం కెక్కడికి ? రాజనగరు ద్వారందగ్గర కాపలాకు

తెర :- (గట్టిగా) చెప్పవేం ?

మొర్దె :- నీ సహచరుడే చెప్పాడుగా

తెర :- (బిగ్తానువైపు చుర చుర చూస్తు) అందుకే నిన్ను మాట్లాడ వద్దంటాను.

బిగ్తా :- (అమాయకంగా) అయితే, నే మాట్లాడింది తప్పా ?

తెర :- తప్పుగాదు తప్పుమ్మస్పావు ... ఇతడు రాజనగరు ద్వారం దగ్గరవుండే ద్వారపాలకు డని నే నెరుగనా యేం ?

మొర్దె :- (సాగిపోతూవుంటాడు.)

తెర :- ఏయ్ ? యూదూ !

మొర్దె :- (ఆగి) ఏమిటయ్యా ! ఆ నీచసంబోధన ?

తెర :- ఏం ? మహారాజా ! అనమంటావా ?

మొద్రే :- నోరు కదిపితే నీచమో లేక ఉచ్ఛమోగాక మర్యాదలకు వేరుమార్గం లేదా యేం ?

బిగ్గా :- మరే ...

తెర :- ప్చ్, నువ్వుండా౹

బిగ్గా :- సరే, నువ్వే మాట్లాడు.

తెర :- (మొర్దెకై తో) నీతో వాదమెందుకు ! పోతే వెంటనేపో, లేకుంటే ఈ రోజు యిక్కడ కూచోడానికి వీల్లేదు. గ్రీకు గూఢచారులు తిరుగుచున్నారట ... వాళ్లను పసిగట్టి పట్టుకోవాలట ... ఎవర్నీ సింహద్వారంవద్ద ఉండనియ్యవద్దని తాకీదు లిచ్చారు.

బిగ్గా :- (అమాయకంగా) తాకీదులా ? ... ఆటిని నాకు చూపలేదేంరా.

తెర :- (ఉరిమిచూచి, పండ్లుకొరికి) ష్షూ ! (మొర్దెకైతో) మేము తిరిగి వచ్చేసరికి నువ్వున్నావో. మరియాద దక్కదు ఆఁ ! ... (బిగ్తానుతో) పదరా మొద్దా !

బిగ్గా :- (పోతూ) ఏం బుఱ్ఱరా నీది ? వావ్వా ! ఇప్పుడర్థమయింది నీ కిటుకు.

తెర
బిగ్గా :- } పారా హుషార్ ! పారా హుషార్ ! (లోనికెళ్తారు)

మొర్దె ;- (వారుపోయిన దిక్కుచూస్తు) ఏమీ ? వీని తలబిరుసు ? "ఏయ్ యూదూ !" ఎంత నిర్లక్ష్య సంబోధన ! ... ఈ నాటికీపారశీక రాజ్యాన పరదేశుల మగుట చేతనేగదా యింత చులకన. (నిట్టూర్చి) ఈతడు తృణీకారంగ బల్కిన యూదు వంశం అంత తేలికైనది మాత్రం గాదు ... దాని విశిష్టత యెంతని తెల్పను!

సీ॥ పరమేశ్వరుని చేయి బట్టి తిరిగిన, ఎ
నోకు భక్తుని గన్న నీ కులమ్ము
ఘన యెహోవా మెప్పు గన్న భక్తుండు, నో
వహుని గన్నట్టి దీవంగడంబు
దేవ దేవునికి ఆతిథ్య మిచ్చిన అబ్ర
హాముని గన్న దీఅన్వయమ్ము
ప్రభునితో బోరి సద్వరము వడసిన యా
కోబునిగన్నదీ గొప్ప కులము.

అగ్ని రథమున పయనించు అద్భుతములు
సింహముల నోళ్లు నొక్కిన చిత్రగతులు
ఎంచ శిలనుండి నీరు పుట్టించు పనులు
కలుగు మా జాతి నే డిట చులక నయ్యె.

అయ్యో! సకలవైభవోపేతమైన యెరూషలేము ఈ ముష్కరుల దాడివలన రూపు చెడి కళాహీనమై పోయినది. అంతియేగాదు

తే॥ గీ॥ ధీనుత జ్ఞానఘని సొలోమోను ప్రభువు
సప్త వర్షాలు తను ధన సర్వములను
పణముగా నొడ్డి కట్టిన ప్రభుని మంది
రంబు పగతుర చే శిథిలంబు నందె.

యెరూషలేమును, పరిశుద్ధ మందిరమును ధ్వంసం చేయబడిన విషాదగాథ ఒకవైపు దహించుచుండ, చెఱగొని తేబడి పారసీక మంతట చెదరియున్న మా యూదులు అన్యసాంగత్య దోషాన కొందరు నిర్దేవులై, మరికొందరు అన్య దేవతారాధకులై యున్నారను వార్త మరియొకవైపు బాధిస్తోంది.

ఏది యేమైన మా పితరు డగు యెహోవా వచించినట్లు నేనును నా యింటివారమును పరమేశ్వరుని పాద పంకేరుహస్మరణ మరువ కున్నాం.

ఆయన కృపా విశేషంచే మాకు మాత్రం గొప్ప మేలే జరిగింది. నా చెల్లి హదస్సా ఎస్తేరు నామంతో పారసీకానికే పట్టమహిషి అయింది మాతాపితలు కరవైనప్పటికి మా చెల్లి అదృష్టవంతురాలే. పెంచి పెద్దచేసినందుకు ఆ ఘనతలో పాలుపంపులు నాకును దక్కినవి. దేవాతిదేవా నీ లీల లనూహ్యాలుగదా

ఉ॥ ఎక్కడి పారసీక ప్రభు వెక్కడి బానిసపిల్ల ? ఎంచగా
నెక్కడి రాజసంపదలు ? యెక్కడి పేదరికమ్ము? దేవ! నీ
చిక్కని ప్రేమ కౌగిలి విశేషము చిక్కిన వారికేది యేన్
తక్కువె? సర్వసంపదవితానము లెక్కయె? ఈధరాతలిన్-,

తెరలో :-

తెరె :- నేను మంత్రి కావలసిందే

బిగ్తా :- నువ్వు వందచెప్పు వెయ్యిచెప్పు నేనే మంత్రిని

తెరె :- కాదు నువ్వు సేనాదిపతి కుండరా నాయనా !

బిగ్తా :- ఉహుం ! నాకొద్దు ... మన హామాను మంత్రిగార్ని చూశాక మంత్రి పదవిమీద మా మోజుగా వుందిరా.

మొర్దె :- (వారి మాటలువిని) ద్వారపాలకులు తిరిగి వస్తున్నారు. ఈ రోజు వీరి మాటల తీరు ఏదో తీరుగావుంది. ఈ మూల దాగి ఆలకిస్తాను. (ఒక మూల దాగును)

తెరె :- (వస్తు) ఒరేయ్ సిన్నగా మాటాడు వాడుంటాడేమో.

బిగ్తా :- (వస్తు) ఇంకా ఉంటాడా? ఈ బిగ్తాగారి దెబ్బకి బిక్కమొగమేసి పిక్కబలం సూపలా. (ఇకిలించి నవ్వును)

తెరె :- అంతటోడివని నాకు తెలుసు ... అందుకే నిన్ను సేనాపతిగ యెంచుకుంట ... ఒరేయ్ బిగ్తాయ్ !

బిగ్తా :- (మూతిముడిచి అయిష్టంగా) ఊఁ ,

తెరె :- సేనాపతిలోవుండే మజాకా నీకేం తెల్సి వద్దంటున్నావ్!

బిగ్తా :- అంతమజా యేం విటేం ?

తెర :- అట్టా అడుగు సెబుతా ... వందలాది సైనికులు వంగి వంగి దణ్ణాలు పెడుతుంటారు (ప్రతిమాటకు అనుగుణంగా బిగ్గాను అభినయించాలి )కమ్మని భోజనాలు కడుపునిండ తినొచ్చు... ఒక యేల యుద్ధమే వస్త దనుకో

బిగ్గా :- (భయంగా) ఆఁ ! యిద్దమా ?

తెర :- అబ్బబ్బ ! ఇనరా ... ఒకచేత్తో కత్తి పట్టుకొని, ఇంకో చేత్తో డాలు పట్టుకొని యుద్ధరంగంలోకి దూకి ఓ వీరులారా! శూరులార ! లెండు, సావో బతుకో తేల్చుకొండు, వెనుక చూడక పోరాడుడు, అని సైనికుల హెచ్చరించుచు శత్రు వుల్ని చీల్చి, సెండాడి మొండేలు, తుండేలు సేసి, నెత్తురు కాల్వ ...

బిగ్గా :- అమ్మోయ్ ! ... (బిగ్గరగా అరచి తెరెషును కౌగలించు కొని) నె ... త్తు రంటే... నా ... కు ... బ....యం...రా. (వణకుచుండును.)

తెర :- అబ్బబ్బ ! యెట్టారా నీతో ? ఇంక యేదన్న ఉద్యోగం యెంచుకోమటి ? .. ఆయ నొచ్చే యే లయింది.

బిగ్గా .- (తలగోకి ఏదో స్ఫురించినట్లు) ఆఁ ! ... వచ్చిందిరా.

తెర :- (ఏఁ విటి ? అనినట్లు చూస్తాడు)

బిగ్గా :- ఖజనా ...

తెర :- ఏదీ ?

బిగ్గా :- ఏఁ విటేదీ ? గ్యాపకం వొచ్చిందిరా ... ఖజానా...

తెర :- ఎక్కడ దాచావురా.

బిగ్గా :- అబ్బ ! కాదురా. ఖజానాదారుడుగా యిప్పించు.

తెర :- ఓఁ, అదా ? ... ఆ ఉద్యోగం ఖాళీ లేదుగా.

బిగ్గా :- ఏం ?

తెర :- అదీ ... నిన్న మనతో మాట్టాడి పొయాడే... అతనికిరా.

బిగ్రా :- మరి ఎట్టాగురా ? ... నాకు కాత్త పిరికిరా. లేకుంటే అడగను. చాకిరీ నాది శీకు నీదా ? నే నొప్పుకోను.

తెర :- అరవకురా బాబూ ! వస్తానన్న వాడింక రాలేదు ఏం జరిగిందో యేమో, బయంగావుంది. (చూచి) అదుగో రానే వస్తున్నాడు ... (బాగా పరికించి) సీ! సీ! ఈ డెవడో సన్నాసోడురా.

(బైరాగి పాటతో ప్రవేశిస్తాడు)

పాట :- అనుబంధం-2

తెర :- ఏయ్, ఆపు.

బైరా :- జై భంబుభంబా! అంతకోప మెందుకు నాయనా! మెల్లగా చెప్పరాదూ ?

బిగ్రా :- మెల్లగా చెప్పటం మా వల్లగాదు ... వెళ్లు వెళ్లు.

బైరా :- వెళ్లక ఉండరాలేదు నాయనా ! (కూర్చొనుచుఁ జై భంబు భంబా !

తెర :- అంటు కూచుంటావేఁ ?

బైరా :- ఈ రోజు యిక్కడ పీఠం వేయా లనుకున్నాం నాయనా !

బిగ్రా :- ఇది మటంగాదు సాములూ సింహద్వారం ... తెలిసిందా? అంతమాత్రమేగాదు సింహబలులు బిగ్రాను తెరెషులు కాపలా కాచేచోటు ... తెలిసిందా ? ... అంతమాత్రమే గాదు ఈ పూవను కోటలోకి మామాట లేకుండ చలిచీమ కూడ దూరడానికి వీల్లేదు ... దూరదు. తెలిసిందా ? ...

బైరా :- జై భంబు భంబా ! తెలిసింది తెలిసింది.. నాయనలారా! ఇటువంటి కోటలు, గోపురాల నెన్నిటి చూచినాము.... మీ వంటివారి నెందరిని చూచినాము.

తెర :- ఏదైన యిక్క డుండగూడదు

బిగ్రా :- మెల్లగా అంటావేంరా ? ... పో! పో! పోక పొయ్యావో మరియాద దక్కదు. ... ఆఁ ...

బైరా :- (నిట్టూర్చి లేచి) జై భంబు భంబా!... సరే పోతాను. కాని ఒక్కమాట. రేపో మాపో అదృష్ట యోగం పట్టబోయే నీకు ఇంత దుడుకు పనికిరాదు నాయనా! (పోబోవుచుండును.)

ఇద్దరు :- (తెల్ల మొగాలతో ఒకరి నొకరు చూచుకొంటారు)

బిగ్గా :- ఒరేయ్, ఈయన మన మాటలు యిన్నాడా యేంరా?

తెర :- లేదురా ... ఈయన సెవురో తప్పకుండ గొప్పోడేరా ?

బిగ్గా :- అయితే, యెట్టాగురా ? ... మనగుట్టు బట్ట బయలు సేత్తాడేమోరా

తెర :- అందుకే మంచి సేసుకుందాం పదరా

ఇద్దరు :- (పోయి) సామీ! దణ్ణాలు ... మన్నించు సామీ!మన్నించు (కాళ్లపై సాష్టాంగ పడతారు.)

బైరా :- జై భంబు భంబా ! లెండి నాయనలారా ! లెండి.

ఇద్దరు :- తప్పు క్షమించానన్న దాకా లేవం.

బైరా :- అల్లే, క్షమించితిని. లెండు తప్పులు మానవులు సేయక, మాకులు చేస్తాయా.

ఇద్దరు :- (చెంపలు వాయించుకొంటు లేస్తారు )

తెర :- దయసేయండి స్వామీ ! ... కూర్చోండి.

బైరా :- జై భంబు భంబా ! ... వెంటనే తప్పు తెల్సుకొన్నారు. (గంభీరంగ) లేకుంటే ఈ భంబోపాసక స్వామి శాపాగ్నికి మీరు ఈ పాటికి భస్మీపటలమై .... . పాపం ! దుమ్మై, ధూళై, పోయేవారు.

బిగ్గా :- (గజ గజ వణకుచు తెరెషు చాటుకువస్తాడు)

తెర :- క్షమించండి స్వామీ! మా వాడికదృష్ట యోగ మన్నారు. అ దేమిటో సెల విస్తారా ?

బైరా :- తప్పకుండ .. ఏదీ వాణ్ణి యిటు రమ్మను....రా నాయనా ! భయ 'మెందుకు ?(ఎగాదిగ చూచి బిగ్గరగా నవ్వును)

ఇద్దరు :- (తెల్లబోయి ఒకరిమొగ మొకరు చూచుకొంటారు)

తెర :- ఏఁవిటి స్వామీ !

బైరా :- (ముసి ముసిగా) వీడికి సైన్యాధిపతి యోగ ముందిరా.

ఇద్దరు :- (ఆశ్చర్యపోతారు)

బిగ్గా :- వ .... ద్దు .... నా ....

తెర :- షూ ! .... తప్పురా .... స్వామీ ! మరి నా సంగతి ?

బైరా :- (ఎగాదిగ చూచి వేళ్లు లెక్కించి) నీకు మంత్రి యోగ ముంది నాయనా !

తెర :- (ఆశ్చర్యంగా) అయితే, ఈ రహస్యమంత మీకు తెల్సునన్నమాట.

బైరా :- జై భంబు భంబా ! సర్వకాలజ్ఞులం, (ఆకాశం వైపు చూపుతు, భంబోపాసకులం. అంతయు తెల్సు .... అబ్బబ్బ ! బహు దూరప్రయాణం కాళ్లు లాగుచున్నవిరా. (కాళ్లు సాచును.)

తెర :- ఈ రహస్యం యెవరికి తెలియనీయకండి స్వామీ !

బిగ్గా :- తెలిస్తే, మహారాజు కుత్తుకలు తీయిస్తాడు.

బైరా :- అభయ మిస్తున్నాను ... మీ ప్రాణాలకు నా ప్రాణం .... నిర్భయంగా చేసి గొప్పపదవులు పొందండిరా.

బిగ్గా :- ఒరే తెరెషూ ! సాములు మా మంచివారురా. (పాదాలు వత్తుచు) సామీ !... నాదోమనవి.

బైరా :- ఇంకనూ ... అనుమానమా ?

బిగ్గా :- లేదు ... కాని, నాకు మంతిరిప్పించి, యీ వాడికి సైన్యాదిపతి యిప్పించు.

బైరా :- అదృష్ట యోగాన్నే మార్చుటా ? ... కష్టసాధ్యమే ... అయినను ప్రాధేయపడుచున్నావు గనుక నీ జాతక చక్రం త్రిప్ప ప్రయత్నిస్తాను.

తెరె :- (వచ్చి భుజాలువత్తుచు) స్వామీ! మీకు యేసేవ జేయమన్నా చేస్తాను నా మంత్రిపదవి మార్చొద్దు ?

బిగ్గా :- (భుజాలు వత్తుచు) వాడి మాటలు యినకండి స్వామీ! (హీనస్వరంతో) నాకు యిద్దరు భార్యలు యిద్దంలోకి పోలేను. (తెరెషుతో) చెయ్యి దియ్యిరా.

తెరె :- (మరికాస్త వత్తుచు) నువ్వే దియ్యి వాడి మాటలు యినొద్దు స్వామీ! .. నేను అదికారంలోకి వచ్చాక మీ పేర వంద మటాలు కట్టిస్తా.

బిగ్గా :- స్వామీ! నీకు పుణ్యముంటుంది. (గడ్డం పట్టుకొని బ్రతిమలాడుచు) నేను వెయ్యి కట్టిస్తా.

తెరె :- చెయ్యి అడ్డం తియ్యిరా. (బిగ్గావు చేతికి పెట్టి కొట్టును. చేతి వెంట గడ్డం వూడి పడుతుంది.)

ఇద్దరు :- (ఆశ్చర్యంగా) ఆఁ! నువ్వా!

బైరా :- (అటు యిటు చూచి) అవును ... నేనే

తెరె :- బేరగాడి వేషంలో వస్తానని బైరాగి వేషంలో వచ్చావేం ?

బైరా :- (మెల్లగా) ఎలా వస్తే యేం గానీ, ఇదిగో (డబ్బుసంచిజోలె నుండి తీసియిస్తు) వెయ్యి దేనారాలు...

తెరె :- బిగ్గాయ్ ! చూడరా, యెంతడబ్బో !

బైరా :- (బొడ్డునుండి పేష్ కత్తితీసి) ఇదిగో (ఇస్తు) దీనిమీద మాగ్రీకు చిహ్నం వుండి వుంది చూడు. దీనితోనే మీ రాజును ఈ రాత్రికి సఫాచేయాలి రేపటికల్లా మీ రాజు కళేబరం మీద ఇటువంటి గ్రద్దలాడాలి ఎట్లాచేస్తారో మరి, ఇది పూర్తయిందో, నువ్వు మంత్రి, .. నువ్వు సైన్యాధిపతి (బిగ్గాతో) నువు సైన్యాధిపతికి భయపడవద్దు అన్ని మేము నేర్పుతాముగా.

తెరె :- విన్నావా ? .. ఈ డబ్బు జాగర్తగా దాయి.

బిగ్గా :- సరే.

బైరా :- ఇక వస్తా .. మహారాజు సఫా అయితేనే మనకు మజా.

బిగ్గా :- ఇంకా సెప్పాలా ?

బైరా :- (గడ్డం అంటించుకొని పాడుతూ పోతాడు)

బిగ్గా :- ఒరేయ్, ఈడు అసాధ్యుడే... యెదవముండా కొడుకు కాళ్లన్ని వత్తించుకొన్నాడు.

తెర :- ఒరేయ్. ఇకనాపి, ఆ డబ్బు జాగ్రత్త సెయ్ ... మాయింటికి పంచుకుందాం

బిగ్గా :- ఒరేయ్, ఈమారు 'ఒరే' అన్నావో ఒప్పను. 'సైన్యాధిపతీ' అను అం! ...

తెరె :- కాక ముందే ...

బిగ్గా :- అనరా ? యినా లనుంది

తెరె :- సైన్యాధిపతీ!

బిగ్గా :- రారా మంత్రీ! పారా దిరుగుదాం. ... సీ, సీ! నాకు మాట్లొచ్చిం దేంటిరా

తెరె : ఈ ఒక్క రోజు తప్పదు లే పదరా.

ఇద్దరు :-
పారా హుషార్ !
పారా హుషార్ !
పారా హుషార్ ! (అనుకొంటు వెళ్తారు.)

మొద్దె :- (ప్రక్కనుండి ప్రవేశించి, ఆశ్చర్యంగా) అయ్యో! వీరెంత రాజద్రోహులు ! గ్రికు గూఢచారినుండి ధనం పుచ్చుకొని మహారాజును హత్యచేయ సంకల్పించారు. తిన్నయింటికే నిప్పంటించు వీరి దురాగతా న్నేమనాలి?... ఈ కుట్ర నిమిత్తమే కాబోలు ఈదిన మెవ్వరిని ద్వారం దగ్గరకు చేరనీయ లేదు.

మొన్ననే వివాహమై ముద్దు ముచ్చటలైన తీర్చుకొనని నా చెల్లికి వైధవ్యమా ? ... అసంభవం !

ఆ॥ వె॥ దురధికార కాంక్షతో చక్రవర్తిని
హత్య చేయ నున్న అధములార !
కట్టు కున్న మీదు గాలి మేడల గూల్చి
క్షేమ మిత్తు రాజ శేఖరునకు.

రాజసముఖాని కేగు టెట్లో తెలియ కున్నది ఆఁ, అంత యేల? మా ఎ స్త్రీకునకు పరిచారకులద్వారా ఈ వార్త నందిస్తాను. ఆమెయే సర్వం చక్కబెట్టు కొంటుంది. రాత్రికిపూర్వమే అందించకున్న ఈ నీచ ద్వారపాలకులు తప్పక ముప్పు కల్గించ గలరు . సత్వర మేగి కార్యోన్ముఖుడ నౌతాను. ... దేవాది దేవా !

( పాట )

నీచరణమె మా శరణం
నిఖిలలోక జీవన

(వెళ్తాడు)



# 4 రంగం

## రాజనగరు, ద్వారం

(మొర్డెకై, హామాను ద్వారము కాయుచుందురు.)

నేపథ్యంలో : (కైవార గీతంలో మొదటి చరణం విన్పిస్తుంది.)

"విశ్వ విఖ్యాతబలశౌర్యదర్పతేజోవిరాజమాన జయతు."

హార్బో :- మొర్డెకై విన్నావా ? వందిమాగధులు కైవారాలు! చేస్తున్నారు. (శ్రీ) హామాను మంత్రులు వేంచేస్తున్నారు.

మొర్డె :- (తేలికగా) రానియ్.

హార్బో :- ఊం ... మన ముందునుండే కదా పోయేది ?

మొర్డె :- (యథారీతి) పోనియ్.

హార్బో :- (ఆశ్చర్యంగా) నీ యుద్దేశం ?

మొర్డె :- ఏముంది ? ఈ ద్వారాన ఎందరు రావడంలేదు ఎందరు పోవడం లేదు.

హార్బో :- బలే ! బలే ! ... నీ తెలివి యింత తెల్లవారు ననుకో లేదు మహామంత్రిని మామూలు వానితో పోలుస్తున్నావ్. రాజశాసనంమాట మరచావా ? యేం ?

మొర్డె :- ఏమిటో ?

హార్బో :- అది! ... మరచిపోయా వన్నమాట ప్రభువుల తరువాత స్థానం హామాను మంత్రిగారిదనీ ప్రతివారకరు వారికి సాష్టాంగ పడాలని, చాటింపలేదూ ? లే, లే, సమీపిస్తున్నారు.

మొర్డె :- నా కేమీ అవసరం లేదు. అవసర మనుకుంటే నీవే సాష్టాంగ పడు.

హార్బో :- నిజమా లేక పరిహాసమా ?

మొర్డె :- ఇందులో పరిహాస మేముంది ?

హార్బో :- లేదా? ... అయితే నమస్కరింప వన్నమాట.

మొ్ర్డె :- అన్నమాటేంటి ? ఉన్నమాటె.

హాన్బో :- మొర్దెకై చెడతావ్. పెద్దవాళ్లతో మన కెందుకు ? ... నిన్న టిదినం ద్వారపాలకులు బిగ్తాను, తెరెషులు చెట్టుకు ఉరి దీయబడ్డారు తెలుసా ! పదవిలో నున్నవారు తలచుకొంటే ఏమైన చేస్తారు.

మొర్దె :- ఎవరి ద్రోహం వారికే ఉరిదీస్తుంది. ... అంతియేగాని ఆ యెహోవా చిత్తం గానిదే ఎవరు యెవరికి యేమీ చేయలేరు.

హాన్బో :- (అటుచూచి) అదిగో! సమీపిస్తున్నారు నీ మాట లెంత వరకు స్థిరమగునో చూస్తాను.

నేపథ్యంలో ( వంది మాగధులు కైవార గీతం పాడుచుందురు. )
విశ్వవిఖ్యాతబలశౌర్యదర్ప తేజోవిరాజమాన ! జయతు !
అరిజనమదమత్తేభకుంభస్థలభేదాహతపంచాననా! జయతు !
అతులవిజ్ఞానవిజయభేరీనినాదప్రకాశమాన ! జయతు !
హమ్మెదాతాతనయహామాన నామసచివకులవిభూషణా! జయతు!
జయతు ! జయతు ! జయతు !

( 2వ స్నేహితుడు వెంట నడచుచుండ, హామాను ఆటోపంతో ప్రవేశిస్తాడు. మొర్దెకై ఏమీ ఎరుగనట్లు నిలుచుటాడు. హార్బోనా సాగిల పడతాడు. )

2 స్నేహి :- (చూచి) మిత్రమా !

హామా :- (ప్రశ్నార్థకంగా చూస్తాడు.)

2 స్నేహి :- అదిగో ! అటు చూడుడు ... ఎంత నిర్లక్ష్యం !

హామా :- ఎవ రాతడు ?

2 స్నేహి :- ద్వారపాలకుడు

హామా :- పరధ్యానంలో వున్నాడేమో

2 స్నేహి :- కాదు ... దురహంకారంలో నున్నాడు. ... వీడు యూదుడు. ఎప్పుడు ఈతడింతే.

హామా :- అప్పుడప్పుడు ఈ యూదుని గురించి వినా మీ రనునది?

2 స్నేహి :- అవును.

హామా :- (పిలువు డన్నట్లు తల వూపి) ఊం !

2 స్నేహి :- ఇదిగో ! ... నిన్నే ?

మొర్దె :- (చూచి) ఎవరిని ? ... నన్నేనా ?

2 స్నేహి :- ఆఁ ! ...నిన్నే? శ్రీ హామానులుంగారు పిలుస్తున్నారు

మొర్దె :- (దగ్గరగా వస్తాడు)

హామా :- నీ పేరు ?

మొర్దె :- మొర్దెకై

హామా :- ఎంతకాలంనుంచి నీవీ కొలువు చేస్తున్నావు ?

మొర్దె :- దాదాపు పదిహేను సంవత్సరాలనుండి

హామా :- పదిహేను సంవత్సరాలా ? .. ఇంతకాలంనుంచి కొలువులో నున్నప్పటికి రాచ మర్యాదలే తెలియవా ?

మొర్దె :- నే నెవరిని అమర్యాద పరుప లేదు.

2 స్నేహి :- జెరక్సస్ ప్రభువుల తరువాత స్థాన మలంకరించు శ్రీ హామానులుంగారికి ఈ అందరివలె యెందుకు నాగిలపడ లేదు?

మొర్దె :- (మౌనంగా వుంటాడు)

2 స్నేహి :- (గట్టిగా) మా టాడవేం ? అది అమర్యాద కాదూ ?

మొర్దె :- కాదు.

హామా :- (బొమ లెగురవైచి) ఊహూం ! .. ఎందువలన ?

మొర్దె :- నా కొక నియమం గలదు. దానివలన.

హామా :- ఓహో ! ... సేవకులు అధిపతులకు విధేయులై నమస్కరించాలి అను నియమం మాకూ ఒకటి కలదుగదా

మొర్దె :- నిజమే...బుద్ధి పూర్వకంగా మీ యెడల అగౌరవ భావం నాకు లేదు .. కాని, నేను యూదుడను .. నా జాతి ప్రజలు నియమనిష్ఠాపరులు వారు యెహోవా తప్ప నరులకు, ప్రతిమలకు నమస్కరింపరు.

హామా :- ఓసి ! పదరుబోతా ! ఏమిరా నీ ప్రగల్భాలు ? .... హుం ! ....యూదాజాతి ఎంత గొప్పగ చెప్పుకొంటున్నావ్? నీ దొంగజాతి, నీ జాతి కొక నీతి ?

సీ॥ ఐగుప్తు రాజుల అడుగు మడుగుల నొత్తి
నీతి మాలినది మీ జాతిగాదె.
అష్షూరు భూపాలు రగచాట్ల పాల్జేయ
ఖ్యాతి బాసినది మీ జాతిగాదె.
సిరియ దేశాధిపు చెరలలో గ్రుగ్గుచు
రోత నొందినది మీ జాతిగాదె.
బబులోను దాస్య దుర్వ్యాధల మొత్తో యంచు
కూత బెట్టినది మీ జాతిగాదె.

నేడు మా పారసీయుల నీడ జేరి
శరణు శర ణనుచున్నట్టి జాతి మీది
ఎపుడు దాస్యంపు టూబిలో నీదు లాడు
నీది యొకజాతి ? దానికి నీతి ? ఖ్యాతి ?

మొర్దె :- తమరు ప్రధానామాత్యులు, నేనో ఒక సామాన్యుడను, తమతో మాటలాడ తెగింపను .... కాని,

హామా :- ఓహోహో ! ఏం వినయం ! ఏం వినయం ! .... ఏమిటో ఆ కానీ,

మొర్దె :- నా జాతిని నీతిని అవహేళన మొనర్చారు. కావున దాని భక్తి శక్తులను తమ కెఱుక చేయుట నాధర్మంగా భావిస్తున్నాను.

సీ॥ అరుణార్ణవము నొక్క యాజ్ఞచే విభజించి
జలమును గోడగా నిలిపె నెవరు !
ఎరికోపురీ కోట బురుజుల బూరశ
బ్దాలతో గూల్చిన భక్తు లెవరు !
దాగోను కోవెల స్తంభంబు నొకగుండ
వలె పెకల్చిన మహా బలుడెవండు !
గొలియాతు రాక్షసు నలవోక బరిమార్చి
ప్రణుతి కెక్కిన బాల భక్తు డెవడు !
జలధరంబుల శాసింప జాలె నెవరు ?
చేదు నీటిని మధురమ్ము చేసె నెవరు !
అట్టి వీరులు, భక్తులు పుట్టినట్టి
జాతి నాయది. దానికి నీతి లేద !

హామా :- ఓయీ ! దుర్మదాంధకారాన, కన్ను గానక మాకే సమాధాన మిస్తున్నావు. ఇంతకు ముందు నీ విషయ మనేక మంది చెప్పినను నే నమ్మియుండ లేదు. నేడు నీ కండకావరము కండ్లార గాంచాను. నే తలచుకొన్న నిన్ను, నీ జాతిని నిమిష మాత్రాన నిర్మూలించ గలను .... హుం.

మొర్దై :- మహామంత్రులు తొందర పడుతున్నారు. సర్వలోక కర్త యెహోవా దేవుని ప్రేమ బాహువుల మధ్య క్షేమంగా నున్న జాతి మాది. దాని కెప్పటికీ ముప్పు లేదు ...ఇక ముందు రాదు.

2 స్నేహి :- (కోపంగా) వాచాలా ! మహామంత్రులకే యెదు రాడు నిన్నేం చేస్తానో చూడు. (కత్తి దూసి పైకెళ్తాడు.)

హామా :- ఆగు.

2 స్నేహి:- వదలు మిత్రమా! చింత జచ్చిన పులుసు చావన ట్లున్న దీతని తీరు.

హామా :- (తేలికగా నవ్వి. స్నేహితుని చేతిలోని కత్తిని తీసుకొని) వేగిరపాటు పనికిరాదు. (దగ్గర నున్న క్రోటను మొక్కను నరికి) ఒరలో పెట్టు....(హేళనగా) అతని దేవుడు కరవాలాన్ని విరిమాలగా మార్చితే గొప్పచిక్కు. ... అప్పుడు కత్తులకు కఱవు రావచ్చు. (నవ్వును)

2 స్నేహి :- కఱవు రాదులే మిత్రమా !...ఆ విరిమాలను ఈ పరమ భక్తులు తిరిగి కరవాలంగా మార్చగలరు. (నవ్వుతాడు.)

హామా :- (హేళనగా) ష్యూ ! నవ్వకు. భక్తులవారికి కోపం రావచ్చు.

2 స్నేహి :- అవును ... వెంటనే శాపము యియ్యవచ్చు.

మొర్దై :- (శాంతంగా) అయ్యలారా! కోప మెందుకు? శాప మెందుకు? సర్వశక్తిగల యెహోవాకు కరవాలాన్ని విరిమాలగా మార్చడము కూడ నొక కార్యమేనా ? ... మన్న.

క॥ వరభక్తుం డహారోనుని
కరదండము పూచి పండు కాయగ లేదే
పరమేశ్వరుండు తలచిన
జరుగని దే ముండు నుర్వి సర్వము జరుగున్.

హామా :- ఓయూ! యెహోవా, యెహోవా యని మాటి మాటికి గొప్పలు చెప్పుకుంటున్నావ్ ? నీ దేవుని సంగతి మాకు త్రొత్తా ?

ఆ॥ వె॥ గుడిని దోచుచుండ గుడ్లప్పగించియే
కూరుచుండె; వాని గొప్ప చేసి
దేవు దేవు డంచు దీనుల ప్రభు వంచు
పొగడు కొనుట, అవ్వ ! నగవు కాదె ?

మొర్దె :- (చెవులు మూసుకొని, గద్గద స్వరంతో) అయ్యో ! నా నిమిత్తం నా దేవునైనను, నాజాతినైనను దూషింపకుడు. నాపై ఆగ్రహమైన నన్ను శిక్షింపుడు లేక చంపుడు.

హామా :- ఛీ ! నిన్ను చంపుటా (నవ్వి) అది యెంత పని! ... (స్నేహితునితో)
మిత్రమా !

2 స్నేహి :- సెల వియ్యండి.

హామా :- పాదయే కంటకమయం! పైగా దారి కడ్డం...గుచ్చుకున్న ముల్లు త్రుంపనా ? గుట్టనే కొట్టి వేయనా?

2 స్నేహి :- గుట్టను కొట్టడమే గట్టి పని ...

హామా :- సెహభాష్ ! ...

2 స్నేహి :- (పోవుచు) మిత్రమా ! ఇదే సమయం...ఈ యూదులకు మన అమాలేకీయులకు ఆదికాలంగా బద్ధవైరం .. నీ వీపదవిలో ఉండగనే ఈ అహంకార జాతిని ఆమూలాగ్రం నశింప జేయాలి చేశావో, మనవంశ చరిత్రలో నీ కీర్తి సువర్ణాక్షరాలతో లిఖింప బడుతుంది.

హోమా :- చేస్తాను ... మొదలంట నరికేస్తాను .... (వికటాట్ట హాసంగా నవ్వుతు, చురచుర మొర్దెకైని చూచి చరచరా పోతాడు.)

మొర్దె :- (మెల్లగా తన చోటికి వస్తాడు)

హార్బో :- మొర్దెకై ! నామాట వినకపోయావు. హోమాను మంత్రి ఆగ్రహంతో పోయాడు .... సామాన్యంగా తలంచకు.

మొర్దె :- ఏమైన నే నేం చేయగలను ? దైవమే చూచుకొంటాడు. దేవా !

తే। గీ। కనులలో నిప్పు కణములు కదలియాడ
ఆగ్రహోదగ్రుడై మంత్రి అరిగినాడు
దీనుడను శక్తిహీనుడ నేను, వేగ
మమ్ము, మాజాతి రక్షింప రమ్ము దేవ!

( తెర )



# 5. రంగం

## అష్టారోతు దేవీ మందిరం

[దేవీ విగ్రహం ముందు ధూప మెగయుచుండును. భయంకర శబ్దాలు విన్పిస్తుంటయి. మాంత్రికు డటు యిటు తిరిగి, ధూపం వేయుటకుకుంపటి దగ్గరకు పోయి గుగ్గిలం చల్లుతాడు. "ఓ ఓ ఓ హాం హాం హాం" అను భయంకర శబ్దం విన్పిస్తుంది. మాంత్రికుడు భయంతో వెన కడుగు వేసి]

మాంత్రి :- (లోపలకు చూచి) రే! గిడ్డా!

గిడ్డడు :- (పూజాద్రవ్యాల పళ్లెంతో) గురూ! (వస్తాడు)

మాంత్రి :- అఖిల లోకాలేలే అష్టారోతు దేవి ఆగ్రహంతో ఆర్భటిస్తోందిరా!

గిడ్డడు:- (భయంగా) అమ్మోరికి ఆగ్రమే, లోపం ఎక్కడుందో గురూ!

మాంత్రి :- ఉందిరా. మాణిక్యాల కంఠాభరణం కావాలని మండిపడు తోందిరా ... గజ్జెల వడ్డాణం లేదని గర్జిస్తోందిరా .... బంగారపు తొడుగుకోసం హంగామా చేస్తోందిరా గిడ్డా!

గిడ్డ :- (కిచ కిచ నవ్వుతాడు)

మాంత్రి :- (ఉరిమి చూస్తు) ఊం!

గిడ్డ :- గురూ!

మాంత్రి :- (ప్రశ్నార్థకంగా చూస్తాడు)

గిడ్డ :- అర్చకుల బతుకులు అమ్మోరికి తెలియ వట్టుంది గురూ!

మాంత్రి :- ఊం! .... బెండులాటి మాటంటే గుండె చీల్తదిరా గిడ్డా! అమ్మ త్రికాలవేదిరా.

గిడ్డ :- (చేపలు వేసికొని, దిగులుగా) మరి యెక్కడనుండి తెద్దాం గురూ!

మాంత్రి :- ఎక్కడ నుండో, ఏం ఖర్మరా! షావుకారు కోటలో నుండేరా.

గిడ్డ :- (గతుక్కుమని) ఆఁ ! ఆఁ ! దొంగతనంగానా గురూ !

మాంత్రి :- (పండ్లునూరి) ఊఁ ! ఔంకులాంటి మాటంటే గుండె చీల్త దిరా. గిడ్డా ! ... దొంగతనమేమి ఖర్మరా ... దొరతనంగానే .. (లోపలనుండి శబ్దాలు .... గిడ్డడు భయపడి గురువు చాటుకు వస్తాడు.)

మాంత్రి :- (గుగ్గిలం చల్లి) ఆగ్రహించకు దేవీ ! నీ కోరిక నెరవేరుస్తాను. నువు మెచ్చే పచ్చల పతక మిచ్చుకుంటాను. ఆగ్రహించకు.

గిడ్డ :- (మెల్లగా) గురూ !

మాంత్రి :- ఏఁ రా ?

గిడ్డ :- అమ్మోర్కుతో అబద్దా లాడొచ్చాగురూ !

మాంత్రి :- (కోపంగా) ఊఁ ! బె డులాంటి మాటంటే గుండె చీల్త దిరా ... ఎవడిదిరా అబద్దం ? .... నాదా ? .... అస్తారు మాంత్రికుడి నోట అబద్ధ మొస్త దంటరా గిడ్డా !

గిడ్డ :- ఉహుఁ, రాదు గురూ !

మాంత్రి :- మరి,

గిడ్డ :- సొమ్ములు లేక అమ్మోరు కోపంగా వుండిందాయె. అమ్మ కొన్న మనల్ని దమ్మిడీకి కొనరాయె. పచ్చల పతకా లొచ్చే తీరు తెలియక ముచ్చెమటలు బట్టి, ఇఱకాటంలో బడ్డ ఎలక లాగ గిజ గిజ గిజ గిజ .. ....

మాంత్రి :- (నవ్వి) గిడ్డడికి మాదొడ్డ సందేహమే అడ్డమయింది .... (నవ్వి) ఒరే, గిడ్డా !

గిడ్డ :- (ఏఁవిటో అన్నట్లు తల వూపుతాడు.)

మాంత్రి :- దేవీ కటాక్షంవలనరా.

గిడ్డ :- (బులుపుగా) యివరించండి గురూ !

మాంత్రి :- ఓరే, యిటురా ! మహామంత్రి హోమానా మన దేవీ మందిరం దర్శింప బోతున్నాడురా,

గిడ్డ :- (ఆశ్చర్యంగా) ఆఁ ఎందుకుగురూ !

మాంత్రి :- ఎందుకేఁవిటిరా యెఱ్ఱిమొగమా! ...అక్కడ వుంటేనేరా బక్క వాళ్లు గుర్తుకొచ్చేది ... దేశంలో వున్న యాదు ల్నందర్ని నాశనం చేయాలని, మహారాజును మభ్య పెట్టి, లెక్కలేనంత పైకం బొక్కసం నుండి లాక్కొన్నాడురా

గిడ్డ :- అయితే, యిక్కడి కెందుకు గురూ !

మాంత్రి :- యాదాసంహారానికి మంచిరోజు చూచుకోడానికి మహాదేవి దగ్గర కొస్తున్నానని కబు రంపాడురా.

గిడ్డ :- (ఆశ్చర్యంగా) నిజంగా గురూ!

మాంత్రి:- ఊఁ ! అప్పారు మాంత్రికుడినోట అబద్ధమూ గిడ్డా ! .... ఒరేయ్. అమ్మవారి కోరికలు హోమాను మంత్రుల చెవిలో వేయాలిరా.

గిడ్డ :- ఓ, అదెంతపని! ....ఎల్లొస్తా

మాంత్రి :- ఎక్కడికిరా .... యెఱ్ఱిమొగమా ?

గిడ్డ :- ఆమాను మంత్రులుతో అమ్మోరి కోరికలు సెప్తానికి గురూ!

మాంత్రి :- (నవ్వి) ఆగరా, ఆగు ! . ఇటురా !

గిడ్డ :- (దగ్గరగా వస్తాడు)

మాంత్రి :- (చెవిలో ఏదో చెప్పగా, గిడ్డడు అర్థమయినట్లు తల ఆడి స్తుంటాడు)

-: బాకానాదం :-

మాంత్రి :- (శబ్దం విని) అదిగో ! మహామంత్రులు వస్తున్నారు. మరి యాదలు జోరుండాలి .... ఎలా మసులుతావో యేమో .... ఎమరేగరా గిడ్డా !

గిడ్డ :- సరే గురూ! (లోని కెళ్తాడు)
(తిరిగి బాకానాదం, గిడ్డడు దారిచూపుచుండ హోమాను ప్రవేశిస్తాడు)

మాంత్రి :- (పూజచేస్తు) మహాదేవీ! సర్వలోక పావనీ! రక్షమాం! రక్షమాం! (చూచి) రండి రండి దయచేయండి. (పీఠం చూపుతూ) అటు కూర్చోండి.

హోమా :- (కూర్చుంటు) మీా పూజలు కొనసాగనిండు.

మాంత్రి :- చిత్తం. (దేవీ వైపు తిరిగి) హే జగదంబా! శత్రు సంహారిణీ! ప్రళయభయంకర తేజోమూర్తి! ఏదీ? నీ కటాక్షవీక్షణ మొక్కమారు యిటు మరల్చు. (గుగ్గిలం చల్లి) మహోత్కటకార్యోన్ముఖుడై, అసమాన శౌర్యధైర్యమూర్తి హోమానుమంత్రి నిను చెంత కరుదెంచినాడు. ఆలసింపక అనుజ్ఞ దయసేయవే, (గుగ్గిలం చల్లి) ఊఁ! .. హే జగదంబా! పలుకవు ఉలుకవు . అలుక యేమిటే? (గద్గదికంగా) మహామంత్రుల సమక్షంలో ఈ మాంత్రికుని మానాభిమానాలు మంట గలుపుతావా దేవీ! (గంభీరంగా) హే! అష్టారోతు దేవీ! నీ సత్య సాక్షాత్కారం జరక్కపోతే నీపాదాలముందే, ప్రాణం వదులుతాను ... మాటాడవా? ... మాటాడవా? .... (కత్తితో పొడుచుకొన బోవును)

గిడ్డ :- (భయంగా) గురూ! (అడ్డం పోతాడు.)

మాంత్రి :- అడ్డం రాకురా గిడ్డా!

(శబ్దం, ఓహాఁ హాఁ హాఁ ....)

మాంత్రి :- (కొంచెం భయంతో వెనక్కు తగ్గి ఆనందతో) ధన్యోస్మి! ధన్యోస్మి! (ధూపం వేయుచుండును. తిరిగి శబ్దం, గిడ్డడు మెల్లగా ఊగుచుండును. మాంత్రికుడు, మంత్రి వాని వైపు ఆశ్చర్యంగా చూస్తారు)

గిడ్డ :- (బాగా ఊగి) నాకు పచ్చల పతకం లేదురా ... వజ్రాలు బొదిగిన వడ్డాణం కావాల్రా ... అయి జేయిస్తే నిన్నాదరిస్తారా నరుడా.

మాంత్రి :- (చేతులు మోడ్చి, దీనంగా) మహాదేవీ! మన్నించు. అల్పుడను. అర్చకుడను .... నీ పాదార్చనే భాగ్యంగా జీవిస్తున్నాను .... ఇది నే నెలా తేగలనమ్మా! .... ఎలా తేగలనమ్మా! ....

హోమా :- మహామాంత్రికా! దేవికి కోరిన ఆభరణాలను కొరత లేకుండ చేయించి సమర్పించుకొంటానని తెల్పు.

మాంత్రి :- చిత్తం (సంతోషంతో) మహాదేవీ! నీ కోర్కెలు కొండెక్కినయమ్మా! కటాక్షించి, ఇక శాంతించు దేవీ! శాంతించు.

గిడ్డ :- (మెల్ల మెల్లగా పూనకం తగ్గి మామూలు స్థితికి వస్తాడు.)

మాంత్రి :- మంత్రివర్యా! దేవి కటాక్షించింది. ఇక మనం ధన్యులం ఇటు రండి. ఇక్కడ నిల్చోండి (హోమాను నిల్చుంటాడు.) ఆఁ, ఇక మీరు వచ్చిన కార్యమేమో మహాదేవితో మనవి చేసికోండి. (గుగ్గిలంచల్లి) జై! మహాదేవీ! మహామంత్రుల మనవి ఆలకించి అలసింపక అనుజ్ఞ దయసేయవే. (లోపల నుండి శబ్దం హోమాను వెనుకకు తగ్గుతాడు) అమ్మ పలుకంతే దొరా! అదురు బెదురు లేకుండ అసలు సంగతి సెప్పెయ్యండి.

హోమా :- (చేతులు జోడించి) మహాదేవీ! దుర్ఘట కార్యమొకటి తలపెట్టి నీ సన్నిధి కరుదెంచాను. విన్నప మాలించి విజయం దయచేయుము.

ఉ॥ భూ జనులందు మాకు జత బోల్చగ జాలిన జాతి లేదు, మ
మిమ్మా జనకోటినుండి ప్రభువే విడదీసెను, వారసత్వ మ
వ్యాజపు ప్రేమతో నిడెను. వారెవ! మాదియె గొప్పజాతి
యం చీ జగతిన్ చరించు కలహీనుల యూదుల గాంచినావటే....

వచ॥ అదియునుగాక,

తే॥ గీ॥ మహిని జను లెల్ల తూర్పున మాది పడమ
రను విరుద్ధ సిద్ధాంతాది గుణులు నగుచు
ప్రతిమ పూజల దూరు దుర్మతులు వారు,
అట్టి యూదుల సహియించు టెట్టు లమ్మ!

వచ॥ నీ కృపా కటాక్షం వలన ఆ మెడ వంచని జాతిని నా కాడి క్రిందకు రప్పించావు ... కావున,

కం॥ వారికి నాశనకాలము
చేతువయై నాదు చేత జిక్కిరి నే నా
క్రూరుల తెగటార్చగ శుభ
వారం బెయ్యదియొ తెల్పి వరలుము తల్లీ !

మాంత్రి :- (బిగ్గరగా నవ్వి) వహ్వా ! వాహ్వా ! శెభాష్ దొరా ! మహాదేవి కిష్టమైన మా ఘనకార్యం తలపెట్టారు. విజయం కోసం వేరే వెతక నవసరంలేదు దొరా ! (హోమానును చూచి) తమ రిటురండి ... హే జగదంబా ! (శబ్దం) మహా మంత్రుల మనవి ఆలకించావు గదూ. (శబ్దం ... వికటాట్ట హాసంతో) సెభాష్ ! హే శత్రుసంహారిణీ ! భయంకర స్వరూపిణీ ! విశ్వవిహారిణీ ! జగదేకరాణీ ! మాసంవారీ, రోజువారీ, నీ సముఖంలో చిట్లు తీయబోతున్నాం. నీకు పరమ శత్రువులైన యూదుల్ని ఆబాలవృద్ధ విచక్షణ లేకుండ హత మార్చడానికి ఏ రోజు మంచిదో తెలియపర్చు ... తెలియ జేస్తావు గదూ ? (శబ్దం) రే, గిడ్డా !

గిడ్డ :- గురూ !

మాంత్రి :- అదృష్టపాత్రె నందుకోరా.

(గిడ్డడు దేవీపాదాల చెంత నున్న కుంకుమ బొట్లుతో అలంకరించిన చిన్న మట్టి పాత్రను తెస్తాడు. )

మాంత్రి :- (కళ్ళుకద్దుకొని) దొరా! దీనిని దేవీ స్వయంగ తన చేతులతో మా ముత్తాత కిచ్చింది. దీని ప్రభావ మింతింత గాదు. భూత భవిష్యద్వర్తమానాల్లోని మంచి చెడుగుల్ని, కొంచెమైన తేడా లేకుండ తెలియజేస్తదిదొరా! ... కళ్ళ కద్దుకొనండి. (హామాను కళ్ళ కద్దుకొని యిస్తాడు.) ఇక మన పని కుపక్రమిద్దాం.

హే ! అస్తారోతు దేవీ ! అదృష్ట భాండంనుండి అద్భుతాలను వెలికి తీస్తావుగదూ (శబ్దం) ఓహో ! (మంత్రదండం భాండంచుట్టు త్రిప్పి) భవిష్యత్సూచనలు బయలు పరుస్తావుగదూ. (శబ్దం) సెభాష్ ! ... దేవీ ఇది 'నీసా' మాసం. ఈ మాసంలో యూదా సంహారం నీ కిష్టమేనా ? (మంత్రదండం చుట్టి) గిడ్డా! అదృష్టభాండం నుండి చీటీ లాగి అయ్యవారికి చూయించరా. (గిడ్డడు పాత్రనుండి చీటీ దీసి హామానుకు చూపగా, దానిపై ఏమిలేదని హామాను సంజ్ఞాపూర్వకంగా సూచిస్తాడు.) 'జీవ్' నెలలో నీ కిష్టమేనా. (ప్రతి నెలకు ఏమీ రాలేదను సూచన చేయాలి.) 'తమ్మూజ్' నెల మంచి దేనా 'సీవాన్' ... ... 'అబ్' ... ... ఆరవ నెల 'ఏలూల్' 'ఏత నీకు' ... ... 'బూల్' ... ... 'కిస్లేన్' ... ... 'టెబేత్' పద కొండవ నెల 'సెబాట్' .... పన్నెండవ నెల 'అదార్' మంచిదేనా? (అనుకూలంగా చీటి పడింది( సెభాష్ ! (నవ్వి) భేష్ ! పన్నెండవ నెల దేవీ చిత్తమయింది.

హామా :- రోజు కూడ తెలిసికో మాంత్రికా !

మాంత్రి :- చిత్తం. (అట్లే కొన్నిసార్లు చీట్లుతీసి) ఆఁ .... పద మూడవ రోజు దేవీ చిత్తమయింది.

హామా :- అనగా అదారు నెల పదమూడవ తేదీ నన్నమాట.

మాంత్రి :- చిత్తం చిత్తం.

హామా :- అబ్బ! పన్నెండు మాసాలోర్చుకోవలెనా ? మాంత్రికా!

మాంత్రి :- దేవీ! కటాక్షం దొరా ! మనం చెప్పిందా ? అదే మేలుకో.

హామా : నిజమే ... అట్లే తాకీదులు వ్రాయించి ప్రతి రాష్ట్రా నికి పంపుతాను. అదారునెల పదమూడవరోజు ఆనందమైన రోజు ... ఆబాలవృద్ధులుగా యూదులు హత మయ్యేరోజు. (బిగ్గరగా నవ్వుచు పోబోయి, ఆగి) అప్తారు మాంత్రికా! అమ్మవారికి ఆభరణాలు వెంటనే పంపుతాను.

హామా :- చిత్తం .... గిడ్డా ! దొరను సాగనంపి రారా.

హామా :- శ్రమవద్దు బయట మా పరివారముంది.

మాంత్రి :- అయిన, మామర్యాదలు మరుస్తామా దొరా! .... గిడ్డా!

గిడ్డ :- గురూ !

మాంత్రి :- దొరను సాగనంపి రారా.

గిడ్డ :- చిత్తం (హామాను, గిడ్డడు లోని కెళ్తారు)

మాంత్రి :- (ధూపంవేసి అటు యిటు చూచి) మా దేవీ! భక్తులు వెళ్లినారు బయటకు రావే ... (శబ్దం) గిడ్డడు గూడ లేడు అడ్డెందుకే
(బొమ్మచాటునుండి, ఒకడు బయటకు రాగా, మాంత్రికుడు కౌగలించుకొంటాడు.)

మాంత్రి :- మా బాగా చేశావురా ... అమ్మవారి పేరుతో అను కొన్నన్ని సొమ్ములు.

వ్యక్తి :- (శబ్దం చేస్తాడు)

మాంత్రి :- అదే అలవా టయిందా? యేంరా!

వ్యక్తి :- (శబ్దం)

మాంత్రి :- హాస్యం చాలించి ఆ తలుపులు వేసిరా?

( ఇద్దరు నవ్వు కొనుచుండగా )

( తెర )



# 6 రంగం

[మొర్దెకై గోనెబట్ట కప్పుకొని, బూడిద వొంటిపై విరజిమ్ము కొని దుఃఖంతో పాట పాడుతూ తెర ముందుకు వస్తాడు... నే పథ్యం నుండి బృందం పల్లవి కలుపుతూ వుంటుంది.]

పాట : అనుబంధము 3

(లోనికి వెళ్తాడు)

తెర ప్రక్కలకు జారుకోగా)

## అంతఃపురోద్యానవనం

ఎస్తేః- (పాటతో ప్రవేశిస్తుంది)

పాట : అనుబంధము 4

నే పథ్యం నుండి : మహారాణి! ప్రమాదం!

ఎస్తేః- (నివ్వెరపోయి) ప్రమాదమా? యెవరికి?

నే పథ్యం :- మీ అన్న మొర్దెకై కమ్మా!

ఎస్తేః- (భయంగా) ఆఁ! ఎందుకు?

నే పథ్యం :- రాజశాసన ధిక్కారానికి

ఎస్తే :- (ఆతురతగా) రాజశాసన ధిక్కారమా!

నే పథ్యం :- గోనెబట్టలు కట్టుకొన్నవాడు రాజప్రాంగణాన ప్రవేశింపకూడదు. అట్లు ప్రవేశించిన వానికి మరణ శిక్ష.

ఎస్తేః- అ క్లైవ రొనర్చిరి?

నే పథ్యం :- మొర్దెకై ...మా మాటలు వినిపించుకొనక గోనెబట్టలు దాల్చి బూడిద విరజిమ్ముకొని రాజనగరు గుమ్మం చెంత నిలిచాడు ... త్వరపడకున్న ప్రమాదం తప్పదమ్మా!

ఎస్తేః- సరియే ... నీవు వెళ్లి హతాకును రమ్మంటి మని తెల్పుము.

నే పథ్యం :- చిత్తం.

ఎస్తేః- అయ్యో! ఇంతలో అంత ప్రమాద మేమి సంభవించినదో గదా? ఆలసించు సమయంకాదు.

హతాకు :- (ప్రవేశించి మొకరిస్తాడు)

ఎస్తే :- హతాకు! వింటివా? మా యన్న మొర్దెకై శోక వస్త్ర ధారియై రాచ ప్రాంగణంలో నిలిచాడట ఎవరికేవిపత్తు సంభవించినదో తెలియదు ... ఏది యేమైన దుఃఖ వస్త్రాలతో రాజనగరులో ప్రవేశించుట దుస్సాహసేరం... వెంటనే అంతఃపురానికేగి నూతన వస్త్రాలు గొనిపోయి వానిని ధరింప మని ప్రాధేయపడితి ననుము ... త్వరగా పొమ్ము.

హతా :- చిత్తం (లోని కెళ్తాడు)

ఎస్తే :- అయ్యో!

ఆ॥ వె॥ దైవనామజపసుధా సేవనము దప్ప
అన్య మెరుగనట్టి అన్నగారి
కే విచార సంద్ర మెద నిండెనో గదా.
వికలచిత్తు డగుచు వీధి కెక్కె.

ఇది యేదియో తప్పక గొప్ప ప్రమాదమే. లేకున్న శాసనాన్ని సైతము సరకుచేయని సాహస మేల కల్గును? హతాకు యింకను రాలేదు. (చప్పుడు) అదిగో, ఏదో చప్పుడు? ... వచ్చుచున్నట్లున్నది. (చూచి నిరాశగా) నా చిత్తము తత్తరపాటు నే మందును? కుందేటి కుప్పిగంతుల చప్పుడును హతాకు రాకగా భ్రమించితిని ... ఆతురత నపార్థము లనేకాలు గదా అదిగో, అతడును రానే వచ్చుచున్నాడు. (తొందరగా) హతాకూ! ఏం జరిగినదట?

హతా :- (గుడ్డలు ప్రక్కగా పెట్టును.)

ఎస్తే :- (నిట్టూర్చి) వస్త్రాలు పుచ్చు కొననేలేదా! అయ్యో! నే నేఅపరాధ మొనర్చి వారి హృదయాన్ని గాయపరచానోగదా హతాకూ! నేనో. నియమితపరివారం దక్క చలిచీమ యేని చొరరాని అంతఃపురవాసంలో నున్నాను. తానో, ఎక్కడో రాజనగరు ద్వారాన వున్నాడు. మా యిరువురి మధ్య వార్త లందించ నీకన్న సమర్థుడు, విశ్వాసపాత్రుడు మరొకడు లేడు. అతి త్వరగాపోయి విషయం తెలిసికొనివచ్చి నాయీ ఆవేదనాగ్ని చల్లార్చి పుణ్యము కట్టుకో ... వెళ్లు.... వెళ్ళు హతాకూ! .... వెళ్ళు.

హాతా :- చిత్రం (వెళ్తాడు.)

ఎస్తే :- పాట.

## అనుబంధం 5

[హాతాకు వస్తాడు, ప్రక్కగా మొర్దెకై వచ్చి నిల్చొంటాడు, అవకాశ మున్నచో పలుచని తెరచాటునుండి మొర్దెకై కనుపిస్తు వుండిన మంచిది హాతాకు అటెన్షన్ లో నిల్చొంటాడు. ]

ఎస్తే :- వచ్చావా హాతాకూ! త్వరగా చెప్పు ఏం సంభవించినదట?

మొర్దె :- ఏం సంభవించినదా ? యూదులకు వినాశం సంభవించింది.

ఎస్తే :- ఆఁ! మన జాతి ప్రజలకా? ... వినాశమా ?

మొర్దె :- అవును. మన జాతి ప్రజలకే

ఎస్తే :- అసంభవం

మొర్దె :- అంతః పురాన కూర్చొండి హాయిని మేయుచు అసంభవ మసంభవ మని కలలు కంటు ఉండు. ఒకనాటి కాయసంభవమే సంభవమై యూదావంశపు మూల స్తంభాలనే పెకలిస్తువుంటే అయ్యో! అని ఆపురు మంటావ్ ?

ఎస్తే :- హుఁ యూదావంశపు మూల స్తంభాలను పెకలించుటా! అది సాధ్యమగు విషయం కాదే.

మొర్దె :- అధికార అర్థబలాల కసాధ్య ముందా హదస్సా !

ఎస్తే :- (ఆశ్చర్యంగా) అధికార, అర్థబలాలా ?

మొర్దె :- అవును ఒకటి కాదు. రెండు కాదు, మూడు కోట్ల ఎనుబది నాల్గు లక్షల దేనారాలను ఈ యూదావంశ నిర్మూలన కార్యానికి వెచ్చించ నున్నారు.

ఎస్తే :- (నివ్వెరపోయి) అఁ! ఇంత ద్రవ్యమా ? ఎక్కడనుండి.

మొర్దె :- ఇం కెక్కడనుండి, మహా ప్రభువుల ఖజానానుండి

ఎస్తే :- (తల అడ్డంగా ఆడిస్తు) నమ్మను.

మొర్దె :- అవును ... నమ్మావు ....ఇప్పుడు నమ్మావు. (నిట్టూర్చి) కాని, రాజ్యంలోని యూదుల కుత్తుక లుత్తరించు కత్తులకరకరలజరిపిడి విన్నప్పుడు నమ్ముతావు శిక్షా కుఠార ప్రేటున నీ యన్న శిరస్సు ధరణీతలంపై దొర్లినప్పుడు నమ్ముతావు .... రక్త దాహం తీరని ఆ ఖడ్గం అఖరు క్షణాల్లో నీ గుండెపై నిల్చినప్పుడు నిస్సంశయంగా నమ్ముతావు.

ఎస్తే :- (చెవులు మూసికొని) చాలు ... మెత్తని మనసుగల ప్రభువులు యూదులపై కారణం లేకుండ కత్తిని దూయరను విశ్వాసంతో అట్లన్నాను. అయ్యో! ప్రభువుల కింతటి నిష్కారణ వైరమేమిటో బోధపడకుంది ?

మొర్దె :- మహాప్రభు లీ కార్యంలో నామమాత్రులే.

ఎస్తే :- ఆఁ! ఆశ్చర్యంగా వుందే! మహారాజును మభ్య పెట్టి ఈ హత్యా కాండ కొడిగట్టిన ఆ జాతిద్వేష రాక్షసి యెవడు?

మొర్దె :- ఇం కెవడు ! హామాను.

ఎస్తే :- (ఆశ్చర్యంగా) ఆఁ! హామానా ?

మొర్దె :- అవును. హామానే.

ఎస్తే :- మనపై అతని కెందు కీర్ష్య ?

మొర్దె :- అతనికి నే సాష్టాంగ పడలే దను ఈర్ష్య మొదటిది. ఇక రెండవది, అతడు అమాలేకీయుడు. అమాలేకీయులకు యూదు లసిన సహజంగా ద్వేషం ... ఇదే ఆద నని మహారాజును మభ్య పెట్టి ధనమును, రాజముద్రికను సంగ్రహించి, మన జాతి నిర్మూలన కుపక్రమించాడు .... ఇదిగో రాజశాసన ప్రతి.
[హాతాకు రాజశాసన ప్రతి నొకదానిని ఎస్తేరున కిస్తాడు. ఎస్తేరు చదువు చుండును ]

మొర్దె :- నన్నొక్కనిని పరిమార్చిన నాకీపరి తాప ముండెడిది గాదు. హదస్సా! నా నిమిత్తమై యావద్రాజ్యములోని యూదులకు కీడు వాటిల్లెనే అనుబాధ పుండులేని గాయమై గుండెను చీరేస్తోంది.... హదస్సా? గుండెను చీరేస్తోంది అవిగో, అటు విను. యూదుల ఆర్తనాదాలు.

[నే పథ్యంలో బృందం, 3 వ అనుబంధం పాటను కొద్దిగా ఆల
పిస్తారు ]

ఎస్తే :- (నిట్టూర్చి) అయ్యో ! ఎంతపని జరిగింది.... మహారాజముద్రి
కతో జారీ చేయబడిన ఈ శాసనానికి తిరుగులేదే .... ఇపు
డేది కర్తవ్యం ?

మొర్దె :- కర్తవ్య మేమిటా అని కాళ్లు ముడుచుకొను సమయం
కాదు ... లే ! .... లే హదస్సా ! నీ స్వజాతి నలముకున్న
కష్టాల కారుచీకట్లను విచ్ఛిన్నం గావించి ఎస్తే రను బిరుదు
సార్థకం చేసికో .... కుల ద్వేషపిశాచితలపై బలంగా గొట్టి
బలహీన వర్గాల యిలవేల్పు వనిపించుకో ....

ఎస్తే :- మార్గ మేమిటో బోధపడకుంది?

మొర్దె :- హుం ! మార్గం ? ముల్లును ముల్లుతోనే తీయాలి.

ఎస్తే :- అనగా ?

మొర్దె :- సద్దు లేకుండ శాసనాన్ని దద్దు చేయించాలి.

ఎస్తే :- అదే అర్థం కాకుంది.

మొర్దె :- వట్టి అనూాయకురాలవు. పట్టపురాణి దిట్టతన మింకను
పట్టుబడలేదు. పట్టుబట్టి, మహారాజుతో ఇది వట్టి అన్యాయ మని
గట్టిగ వాదించలేవు ?

ఎస్తే :- పట్టుబట్టుటకు, గట్టిగ వాదించుటకు ముందు ప్రభువుల సంద
ర్శనభాగ్య మవసరంగదా.

మొర్దె :- (ఆశ్చర్యంగా) అనగా ?

ఎస్తే :- నేటికి నెల నాళ్ళుగా ప్రభువులు నిలయానికి వచ్చుటలేదు.

మొర్దె :- (భయంగా) ఎందుకు ? ... మహాప్రభువుల మనసు నొప్పిం
చావా సోదరీ !

ఎస్తే :- లేదు ... ఏవో రహస్యపు రాచకార్యాల్లో రాత్రింబవళ్ళు
నిమగ్నులై యున్నారు అనుమతి లేక ఆఅంతర్గృహాన ఎవరును
ప్రవేశింపరాదని శాసించారు. అట్లతి క్రమించిన వారిని
ఆ కొన్నమృగాల కాహారంగా వేస్తారట.

మొద్దె :- (నిట్టూర్చి) అయ్యో ! తపనకు తట్టుకోలేక కాటిచెట్టు నీడ కేగిన బట్టతలవాని బ్రతుకులా ఎటు బోయిన ఎదురే వస్తోంది ... (నిరాశగా) సోదరీ ! ఇంతకు రాజదర్శనావ కాశమే లేదా ?

ఎస్తే :- ఉంది, అసిధారావ్రతం వంటి అవకాశ మొక టుంది.

మొద్దె :- అనగా ?

ఎస్తే :- ప్రవేశింపగనే ఎవనివైపు ప్రభువు సువర్ణదండం చాచునో వాడు మాత్రం రక్షింప బడునట.

మొద్దె :- అటులనా ? ... ఇకలే ... బయలు దేరు ?

ఎస్తే :- (భయంగా) ఎక్కడకు ?

మొద్దె :- ఇంకెక్కడకు ? రాజసముఖానికి.

ఎస్తే :- (భయంతో) పోలేను ... పోయి ప్రభువుల కోపాగ్నిలో భస్మీపటలం కాలేను.

మొద్దె :- (నిష్ఠురంగ) అవును, ప్రభువుల కోపాగ్నిలో భస్మీపటలం కాలేవు. కాని, అధము డగు ఈహామాను రగిలించు హత్యాగ్నిలో దగ్ధం కావడానికి సిద్ధంగా వున్నావు .... అంతేగా? .... (కొంచె మాగి) రాజాంతఃపురంలో నున్నాను. నా కేవిపత్తు రాదని తలస్తున్నావేమో, శాసనప్రతి నొకమారు చూడు. పదవులను పాటింపక, స్త్రీ పురుష తారతమ్య రహితంగా, వయో భేదాల వర్జించి, పారసీక రాజ్యాన గల ప్రతి యూదుని అదారు నెల పదవ మూడవ రోజున హతమార్చి, ఆస్తుల నపహరించాలి. అని వుంది .... అందు నీవు మాత్రం తప్పించుకొందునని యే ముంది ?

ఎస్తే :- సర్వేశ్వరా !

తే॥ గీ॥ ధరణి విభు దర్శనమునకు దారి లేదు
జాతి రొమ్ములపై దుష్టశాసనాస్త్ర
మకట ! సంధింప బడెను, .... నే డాదరింప
దీనజన బాంధవా ! నీవె దిక్కు, రావె !

మొర్దె :- ఆలోచనకు హద్దులున్నయ్ హాదస్సా ! ఆపత్సమయంలో ఆలోచన నెపంతో ఆలసించడంకన్న అపరాధం, అధమస్థితి మరొకటి లేదు. ఒకమర్మం, ఈసమయాన నువ్వు మౌనం వహించితే, యూదులకు సహాయం, విమోచన మరోవైపునుండి వస్తుంది. రాదనిమాత్రం తలంచకు. వారు సర్వేశ్వరుడు ప్రత్యేకించుకున్నవారు .... అయితే, నీవును, నీవారు మాత్రం నశిస్తారు. మరొక్క మర్మం ! .... సర్వకాల వేదియైన సర్వేశ్వరుడు ఈ ప్రమాదాన్ని గుర్తించియే నీకు పట్టమహిషీత్వం కట్ట బెట్టినాడేమో ... జాగ్రత్త !

ఎస్తే :- ఇప్పు డేం చేయ మంటారు ?

మొర్దె :- ఆలోచనలకు ఆచరణరూప మిచ్చి. ప్రతీకారానికి బయలు దేర మంటాను.

ఎస్తే :- ఇప్పుడే అంత తొందర రేల ? .... ప్రభువుల శాసనానికింకా పది మాసాలు గడు వుంది. ఈలోగా ప్రభువులు ప్రసన్నులు గావచ్చు ... కావున, ....

మొర్దె :- (ఉగ్రుడై) ఆపు ! ... ఈ అనునయవాక్యాల కానంద పడబోను. యావద్రాజ్యంలోని యూదులు ఈ క్రూర శాసనం చూచినదాది గోనె బట్టలు కట్టి, ఆపాదమస్తకం బూది జిమ్ముకొని హాహాకారాలతో అవధుల్లేని ఆపత్సంద్రంలో తలమున్కలగుచుండ నీరసపు వాక్యాల వారధి నిర్మించి కన్నీరు తుడువాలని కలలు కంటున్నావా? ... హాదస్సా !

సీ॥ కఱవులో తనవారి కాచిన సద్గుణ
　　శాలి జోసఫు నొక్కసారి చూడు
జాతికై రాజలాంఛనముల వీడిన
　　వీర మోషే నొక్క మారు చూడు
తనవారి వీడి వాగ్దాన ప్రజాళినే
　　కోరిన రూతు నోమారు చూడు
అన్య దేవతకన్న అగ్ని మేలనుకొన్న
　　షద్రకాదుల నొక్కసారి చూడు
వీరలెల్లరు మనముందుదారి చూపు
వారు, వారల మదినెంచి బయలుదేరు
సర్వభాగ్యాలు పదవు లీయుర్వియందు
క్షణికములు; సోదరీ! దైవశక్తిముందు

ఎస్తే :- (దిగులుగా) ఇంతకు నే నేమన్నానని.

మొర్దె :- (వినిపించుకొనక) నిజంగా యూదాజాతిరక్తం నీలో ప్రవహిస్తూంటే, ప్రత్యంగములో ప్రతీకారేచ్ఛ ప్రళయరూపంలో ప్రస్ఫుటమై ప్రాణాన్ని తృణప్రాయంగ నెంచి పయనమయ్యేడిదానివి.

ఎస్తే :- (బాధగా) చాలు ... మీ రనినట్లు జాతియెడ ఉదాసీనవైఖరి నా కెన్నడు లేదు.

తే. గీ॥ అల్పురాలను జేల నోయన్న నేను,
అమహాత్ములతో పోల్చకయ్య నన్ను
అయిన నేగెద, జాతి సౌఖ్యంబుముందు
పట్టమహిషీత్వమైన నా ప్రాణమైన
గడ్డిపోచ సమానమె? గాక ఘనమె?

(నిశ్చయంతో) ప్రళయమైనను ప్రభువుల దర్శనాని కెళ్తాను. నాకోసం, జాతిక్షేమంకోసం, షూషనుకోటలోని యూదు లందరు మూనాళ్లు ఉపవసించి ప్రార్థించండి ... నేను, నా చెలి కత్తెలుకూడ ప్రార్థిస్తాం.

మొర్దె :- (సంతోషంగా) సెహభాష్ ! ... జాతిసంరక్షణదీక్షా కంకణధారిణీ ! ఎస్తేరూ ! నీపేరు యూదావంశనభోమండలాన, జాజ్వల్యమానతారగా, ఆచంద్ర తారార్కం శోభిల్లుగాక ! విజయశ్రీ నీవెన్నంటి ఉండుగాక ! అబ్రహాము, ఈసాకు, యాకోబుల దేవుడు నీతోపాటు వచ్చుగాక !

(లోని కెళ్తాడు. హాతాకును వెళ్తాడు.)

ఎస్తే :- తే॥ గీ॥ స్వర్ణదండము నావైపు చాచెనేని
జాతిక్షేమంబు గూర్చిన ఖ్యాతి దక్కు.
ప్రభుని కోపాగ్ని నాపైన రగిలెనేని
జాతికై ప్రాణ మొడ్డిన ఖ్యాతి దక్కు.

( తెర )



# 7 వ రంగము

## హామాను మందిరం.

[ మూడు కుర్చీలు, బల్ల, బల్లపై మధు పాత్రలు ఉంటయ్. గోడకు డాలు, కత్తులు తగిలించి ఉంటయ్. ]

హామా :- (ఈల పాటతో ప్రవేశించి, ఒక గుక్క మధువు త్రాగి తిరిగి పాడుచుండగా)

తెరలో :- (చప్పట్లు వినపడతయ్)

హామా :- (కలియజూచి) ఎవరు ?

( నిశ్శబ్దం )

(తల అడ్డంగా ఆడించి, మందహాసంతో) ఎవరు లేరు ... భ్రమపడ్డాను. (ఈమారు కూనరాగం తీస్తు మధువు పోసుకొంటు వుంటాడు. )

తెరలో :- (నవ్వులు)

హామా :- (ఆశ్చర్యపడి కలియజూచి ఉగ్రుడై) ఎవరు ? (కత్తి దూసి) పారసీక రాజ్య పంచాస్యంతో పరిహాసమా ? (పండ్లు నూరి) అరిజనభీకర హామానుతో అపహాస్యమా ? (ఆలోచించి) యూదులు పన్నుగడలో మిన్నలని నా మిత్రులు వచించారు ... ప్రతీకారేచ్ఛతో నా యీ మందిరాన రహస్యంగా ప్రవేశింప లేదుగదా. (నవ్వి) అహవమునందును, వ్యూహామునందును ఎదురులే రనిపించుకొన్న నేను అర్ధ ప్రాణంతో అలమటించు ఈ చచ్చుపీనుగుల ఉచ్చులలో తగుల్కొందునా ! (బిగ్గరగా) ఓరోరీ ! పిరికి పందల్లారా !... తెరల మాటుననుండి పరిహసింప నేల? మగతనం బున్న వెలికి రండు. మీ కళేబరాలను నా కరాసి కాహుతిగావించి కాకులు గద్దల కేస్తాను. (కత్తి ఝుళిపించుచు అటు యిటు చూచు చుండగా "సెభాష్" అంటు ఇద్దరు స్నేహితులు వస్తారు. హామాను నివ్వెరపోయి చూచి కత్తిని జార విడిచి కౌగలించు కుంటాడు )

హోమా :- మీరా ?

1 స్నేహి :- అవును ... మేమే, మహామంత్రుల కకారణంగా ఆగ్రహం కలిగించాం.

2 స్నేహి :- (హీనస్వరంతో) సరసం విరసమై వడుసదవ్వునేమోనని భయపడ్డాం.

హోమా :- (మందహాసంతో) ఎందుకు ?

2 స్నేహి :- ఎందుకేఁవిటి ? ... సంహారం లేకయే ఎత్తిన కత్తి నుపసంహారించడం నీ కలవాటు లేదు గనుక.

హోమా :- నిజమే .... ప్రమాద మయ్యేది ... మరి సరాసరి లోని కెందుకు రాక పోయారు ? (మధువు నందిస్తూ) కూర్చోండి.

1 స్నేహి :- రావాలనే వచ్చాం . కాని ....

హోమా :- ఊఁ ! కాని ?

2 స్నేహి :- కాంతలతో సరాగా లాడునపుడు రావడం ఎంత మిత్రులమైన తగదుగదా.

హోమా :- (ఆశ్చర్యంగా) కాంతలతో సరాగాలా ! ఏదీ కాంత? .... భ్రమ పడ్డారా ?

2 స్నేహి :- ఉంది .... మేము చూచాం

హోమా :- అబద్ధం.

2 స్నేహి :- నిజం (అభినయిస్తూ) చేయి చేయి కలిపి హాయి హాయిగా తీయ తీయగా

హోమా :- అబ్బబ్బ ! ఏ కాంత లేదు మిత్రమా ! నేనే ఏకాంతంగా ఏదో ....

2 స్నేహి :- అబ్బబ్బ ! ఉంది మిత్రమా !

హోమా :- నీకు నిజంగా మతిపోయింది ఇంతకూ ఎవరు ఆ కాంత?

2 స్నేహి :- అలా అడుగు చెప్పనా .... అదృష్టకాంత !

హోమా :- ఓ, అదా ! (ముగ్గురు నవ్వుకొంటారు)

1 స్నేహి :- నేస్తమా! .... మనవాడి మాటలు వాస్తవం నిజంగా అదృష్టదేవత నిన్ను వరించినట్లు మరెవ్వరిని వరించలేదంటే నమ్ము.

2 స్నేహి :- అమాత్యకీయ వంశరత్నం ఈ రోజు మరింత ధగ ధగలు కురుస్తోంది. కారణ మడుగవచ్చా ?

హామా :- (నవ్వి) ఊహూం పసిగట్టావ్ ? అసాధ్యుడవే .... ఈ రోజు అద్భుతమైన విందు !

2 స్నేహి :- (గుటక వేసి) ఏదీ ?

హామా :- అనుకోనని గొప్ప విందు !

2 స్నేహి :- (ఆశగా) ఎక్కడో పోదాం పద మిత్రమా !

హామా :- అనుభవించి వచ్చాను.

2 స్నేహి (హతాశుడై) ఆఁ ! .... అయిపోయిందా (కొంచె మాగి) నువు తిని ఆనందిస్తే మేం విని ఆనందిస్తాం .... ఎక్కడో? ఎవరిదో ? ఎట్టులో వివరించు మిత్రమా !

1 స్నేహి :- మహామంత్రికి విందులు కొత్తగాదు. కాని యిందులో విశేష ముండి ఉంటుంది

హామా :- (తన్మయంగా) అందరికి అందుబాటుగాని విందు

2 స్నేహి :- నీ కందింది గదా .... ఇక చెప్పు.

హామా :- మహారాజు, నేను, సేనాధిపతులు,

2 స్నేహి :- విందును గూర్చి అడుగుతుంటే అందరి విషయ మెత్తుతా వేమయ్యా !

హామా :- అవును, తీగ కదిపారు. డొంక కదలక తప్పదు .... రహస్య మందిరాన రక్షణ పథకాలు రచిస్తున్నాం .... ఇంతలో అకస్మాత్తుగా ఒక దేవత మా యెదుట సాక్షాత్కరించింది.

1 స్నేహి :- (ఆశ్చర్యంగా) దేవతా ?

హామా :- అవును. అందాల దేవత.

ఇద్దరు :- ఎవరు మిత్రమా !

హేమా :- మన మహారాణీ ఎస్తేరు.

1 స్నేహి :- ఓహో ! .... ఆ తరువాత ?

2 స్నేహి :- తరువాత అడగాలా ? .... మనవాడి హృదయం ఉప్పొంగిపోయుంటుంది .... అంతేగదూ !

హేమా :- కాదు .... కంపించి పోయింది.

1 స్నేహి :- ఎందుకు ?

హేమా :- అనుజ్ఞలేనిదే ఆ అంతర్గృహాన ప్రవేశింపరాదు.... అతిక్రమించినచో శిక్షేమిటో తెలియునా ?

2 స్నేహి :- ఏమిటో ?

హేమా :- ఆకొన్న మృగాల కాహారంగా వేయడం.

2 స్నేహి :- (గాబరాగా) ఆఁ

1 స్నేహి :- వష్తీరాణివలె ఈమెకూడ ప్రభువుల ఆగ్రహానికి గురయిందా యేం ?

హేమా :- లేదు .... అనుగ్రహానికి గురయింది, ఆదరంతో బంగారు దండం చాచి ఆహ్వానించాడు .. అంతే, ఆమె వచ్చి ఆదండం చివర ముట్టింది.

1 స్నేహి :- (నిట్టూర్చి) అమ్మయ్య ! తరువాత ?

2 స్నేహి :- మహారాణీ ! ఏమి నీ కోరిక ? అన్నాడు చక్రవర్తి.

హేమా :- (తలవూపి) అంతే .... అడుగు? అర్థ రాజ్యమైన ఇస్తానన్నాడు ? కాని, మారు పలుక లేదు .... మహారాజును, నన్ను విందుకు రమ్మని మాత్రం, కోరింది.

1 స్నేహి :- ఆహాహా ! ఎంత అదృష్టవంతుడివోయ్.

హేమా :- (తన్మయంగా) విందులో రాణీ స్వయంగా పానీయ మందించింది.

స్నేహి :- హోహో ! అమృతధార !

హామా :- ఈ రోజే కాదు. రేపుకూడ.

2 స్నేహి :- ఎలాగు?... మరి అదృష్ట దేవత వరించిందంటే ఆశ్చర్య పోయా వెందుకు?... పట్టమహిషీ విందు భోజనం పట్టుమని అందరికి దొరుకుతుందా ? అదృష్టానికి మారుపేరు నీవేనోయ్ మిత్రమా ! నీవే...

1 స్నేహి :- నిజమే, అందం అణకువగల అర్ధాంగి

2 స్నేహి :- కులదీపకులగు కుమారులు

1 స్నేహి :- సకల భోగ భాగ్యాలు

2 స్నేహి :- సమున్నత పదవి.

ఇద్దరు :- ఓహో హో ! ఒకటేమిటి ?

1 స్నేహి :- అష్టైశ్వర్యాలు ఆకారం దాల్చి

2 స్నేహి :- నీ అడుగులకు మడుగు లొత్తుచున్నవంటే నమ్ము.

హామా :- మిత్రులారా ! మీ అభినందనలకు కృతజ్ఞుణ్ణి నిన్నటి దినాన గ్రీకు సేనలను మూకుమ్మడిగా సంహరించేందు కొక వ్యూహాన్ని రూపొందించాను. చక్రవర్తి దానిని చూచి 'శెభాష్' ! హామానూ! అనన్యమైన నీ ప్రజ్ఞకు అతి త్వరలో సన్మానం జరిపింతు నని వీపు దట్టారు...మీ రన్నట్లు అష్టైశ్వర్యాలు నాకు హారతు లిడుచుండ, అదృష్టదేవత నన్నాలింగనం చేస్తోంది. నిజమే, (నిట్టూర్చి) కాని,

తే|| గీ|| ఖలుడు యూదుడు ద్వారాన నిలుచునంత
కాల మీ భోగ భాగ్యాల కతన కల్గు
సంతసము మేడిపండుతో సమము సుమ్ము

ఇద్దరు :- ఎందువలననో తెల్పుము విందు మయ్య !

హామా -: చుక్క గరళమ్ము చాలదే సుధను చెఱుప ?

ఇద్దరు :- (పక పక నవ్వుతారు)

హామా :- నవ్వుతా రెందుకు?

2 స్నేహి :- ఆఁ, ఏమీ లేదు ... మృగరాజు దిగులు పడిందట

హామా :- ఎందుకు ?

2 స్నేహి :- కుందేటితో పందెం వేయలేక.

హామా :- (నవ్వుతాడు.)

2 స్నేహి :- నవ్వుతా వెందుకు ?

హామా :- ఊహుఁ ! మాటకు మాట ...కాని నే భయపడడం లేదే.

1 స్నేహి :- మరి ఈ వ్యాకుల మెందుకు ?

హామా :- రాజదర్బారుకు పోవునపుడు వచ్చునపుడు అహంకారియగు ఆతని అలక్ష్యస్వభావం న న్నపహాసిస్తున్న ట్లుంటోంది.

2 స్నేహి :- మిత్రమా !

హామా :- (చూస్తాడు)

2 స్నేహి :- నీ యూదా సంహారయాగానికి మూర్ఖుడగు ఈ మొర్దెకైని ప్రారంభోత్సవ బలిపశువుగా యెందు కుపయోగించుకొనరాదు ?

హామా :- శెహభాష్ ! నాతలంపు అదే ... మొట్ట మొదటిగా ఈ నీచునే పట్టి బంధిస్తాను. దినాని కొంత చర్మం వొలిపిస్తు చిత్రహింస చేస్తాను.

1 స్నేహి :- ఎప్పుడు.

హామా :- అదారునెల త్రయోదశి ఉదయాన.

2 స్నేహి :- తాత చచ్చి అవ్వ ముండమోసినపుడు.

1 స్నేహి :- చాలు చాలు. అప్పుడు నీవు ప్రారంభించున దేముంది. తిరుగులేని రాజశాసనమే కంఠాల తరిగి పోస్తుంది

హామా :- కనుక ?

2 స్నేహి :- కనుక, నీ ఆనందవనాన్ని అపహాస్యం చేస్తున్న ఈ ముండ్ల తుప్పను రేపో మాపో మొదలంట ఎందుకు త్రుంచ కూడదు ?

1 స్నేహి :- ఈ నీచుని గురించి నిత్యం నువ్వు పొందే బాధను నీ భార్య జెరెషుద్వారా విన్నాం ... బాధపడ్డాం ... వెంటనే ఈ కంటకాన్ని లాగివేయ్.

హామా :- నిజమే ... రేపే వీడిరూపు మాపుతాను ... వీడి కేశిక్ష యితే బాగుంటుందో ఆలోచించండి.

2 స్నేహి :- దురహంకారుడికి తగింది ఉరిశిక్షే.

హామా :- సెభాష్ ! రేపే ఉరి దీయిస్తాను. ఈ నీచుడి చావు చూచి హామా నంటే హడలిపోవాలి. అందుకుగాను ఏభై మూరల కొయ్య తెప్పించి మా యింటి దాపులో పాతించండి, దానికి వీణ్ణి ఉరిదీయిస్తాను

ఇద్దరు :- (కరతాళధ్వనులు చేస్తు) ! సెహభాష్ ! మిత్రమా సెహ భాష్ !

హామా :- (మధువు పోసి యిస్తు) మిత్రులారా !

ఉ। కట్టితి కక్ష, మొర్దెకయి కంఠమునం దురిజుట్టి జాప చే
పట్టితి దీక్ష, రేపె మన పట్టపురాణి యొసంగు విందు సం
దెట్టులనైన శిక్ష ధరణీశునిచేత ధృవీకరింతు నే
నొట్టిశిచెప్ప చుంటి నిదెయూదునిచంపక చూడమిమ్ములన్ .

ఇద్దరు :- విజయీభవ !

(ముగ్గురు గ్లాసులు ఎత్తి త్రాగుచు, నవ్వుచుండగా)

[ తెర ]



# 8 రంగం

## ఎస్తేరు మందిరం

[ఒక బల్ల రెండు కుర్చీలు వుండాలి. చిత్ర పటాలు కొన్ని బల్లమీద ఉంటయి. ఒక చిత్రపటాన్ని కుంచెతో దిద్దుతు]

ఎస్తేరు :- పాట

### అనుబంధం 6

ఎస్తే :- (చూచి, ఆనందంతో) ప్రభూ !

జెర :- (ప్రేమగా) ఎస్తేరూ ! (చేతులు చాచును)

ఎస్తే :- (జెరక్సస్ కౌగిలిలోనికివచ్చి) దయ చేశారా? (చెంగుతో భాష్పాలు తుడుచుకొంటు వుంటుంది)

జెర :- దేవీ!... (ఆశ్చర్యంగా) ఏమి టిది ?

ఎస్తే :- ఆనంద భాష్పాలు నెలనాళ్లకు ప్రభువులు నా నిలయానికి వేంచేశారు. ప్రభూ !

తే॥ గీ॥ వేసిగాడ్పుల తాకిడి పీడనమున
కలగి నిస్పృహ లూర్చెడు జలధరమ్ము
చల్లగాడ్పుల స్పర్శకు నుల్లసిల్లి
జల్లులను రాల్పకుండునా జ్ఞాతలేంద్ర !

జెర :- (జాలిగా) నా యందాల దేవి కావేదన కల్గించాను. ఇకనుండి మన ప్రణయకాలచక్రాని కైదే ఋతువులు. గ్రీష్మాని కడ్డు గీటు పెట్టాను ...అయినను అంత బెంగయా ? నిను వీడి నేను మాత్ర ముండ గలనా ? చూడు ?

తే॥ గీ॥ అతుల మకరంద మాధురి నందగోరి
గండు తుమ్మెద రాదె పంకజము కడకు
అల శరత్కాల చంద్రిక లనుభవింప
కోరి చేరదె చంద్రు చకోర మబల !

తార లేక రేరాజుండ గలడా? ఎస్తేరు లేక ఈ రాజుండ గలడా? (బుగ్గపై చిటిక వేయును)

ఎస్తే :- ధన్యురాలను.

జెర :- (చిలిపిగా) ప్రణయసల్లాపాల పరవశంలో విందు విషయాన్నే విస్మరించావా యేం ?

ఎస్తే :- (మందహాసంతో) మన్నించండి... సామానుకు కబురంపాను. అత డీపాటికి వస్తూవుండ వచ్చు .... అంత దనుక ఈ పటాలను పరికిస్తు వుండండి .... లోనికేగి సర్వసంభారాల నాయత్తం చేస్తాను (చిత్ర పటా లందించి పోబోవు చుండును)

జెర :- (చేయి బట్టుకొని ఆపి) ఓహో! చిత్రలేఖనంలో మంచి యభి వృద్ధినే సాధించావే (ఒక పటాన్ని చూపుతు) చిత్రకారిణీ!.... ఈ చిత్ర పటాని కర్థ మేమి? . ఈరా జెవడు? .. ఆలోచనా మయుడై పానీయాన్నందించే ఈత డెవడు ?

ఎస్తే :- ప్రభూ! ఇది మా పితరుడైన జోసఫ్ చరిత్రములోని ఒక సంఘటన. అతడు ఐగుప్తురాజు ఫరో, ఇతడు పానదాయకుడు.... ఈ పానదాయకుడును, మా పితరుడును కాలవశాన ఒకే చెర సాలలో నుండిరి. స్వప్న భావం తెల్పి, పానదాయకునకు తిరిగి పదవి లభిస్తుం దని జోసఫ్ చెబుతాడు ... పదవిలోకి వచ్చిన పిదప తనను జ్ఞప్తిచేసి కొమ్మంటాడు ... పదవి లభించింది. కాని మరచి పోయాడు ... ఒక రాత్రి ఫరో స్వప్నం కని దాని భావం తెలియక తికమక పడుతుంటాడు. ఇంతలో పాన దాయకునకు జోసఫ్ జ్ఞప్తికి వచ్చాడు. మతి మరపునకు బాధ పడు తున్నాడు.

జెర :- బాగుంది ... పేరే మిడితివి ?

ఎస్తే :- మరపు

జెర :- సెహబాష్ ! పే రెన్నికలో యెంత విజ్ఞత !

ఎస్తే- అవును తాము కళాస్రష్టలయ్యే. పరుల కళలను ప్రశంసించుట లోనే వుంది, విజ్ఞతాయుతరసజ్ఞత.

జెర (ముద్దుగా చూస్తు) ఊహుఁ !

ఎస్తే :- ఊఁ !... (సిగ్గు నభినయిస్తు లోని కెళ్తుంది)

జెర :- (పోయిన వంక జూచి, తిరిగి పటమువైపు చూచి; ఆలోచనగా) మరపు ! (రెండుసార్లు ఆపద ముచ్చరించి ఏదో ఆలోచిస్తు కిటికీ చెంతకు వచ్చి నిల్చుంటాడు )

హామా :- (ప్రక్కగా ప్రవేశించి)

మ॥ అదిగో! భూపతి యుండె నొంటరిగ, నాయాలోచనల్ పండె, నే వెదకం బోయిన తీగె కాలు దగిలెన్, వేవేగ చూదుర్మతిన్, తుద ముట్టింపగ నాజ్ఞ పొందెదను. మిత్రుల్ క్షేమ క్షేమంచు నా కెదురై స్వాగతమిత్తు రింక, భళి రే! యేమందు మద్భాగ్యమున్.

(ప్రకాశంగా) ప్రభువులకు ప్రణామాలు.

జెర :- (తిరిగి చూచి) మంచిది ... అటు కూర్చుండుడు.

హామా :- (కూర్చుంటాడు)

జెర :- హామానూ ! ఈ చిత్రపటాన్ని చూడు.

హామా :- అద్భుతంగావుంది ప్రభూ !

జెర :- హామానూ ! ఈ చిత్రపటం రాత్రినుండి నా మదిని కలచే విషయాన్ని మరింత కలచింది సుమా.

హామా - (ఆశ్చర్యంగా) అ దేమిటి ప్రభూ !

జెర :- (సాలోచనగా) హామానూ ! నా మనసుకు నచ్చినవాడు

హామా :- ఎవరు ప్రభూ!

జెర :- పేరు తరువాత తెల్పెదను ... నా ప్రాశంసకు పాత్రుడైన వాడు ఒక్కడు కలడు. అతనికి నేను నాదేశం ఋణపడ్డాం.

హామా :- (తనలో) డెందమా తొందరపడకు. మహారాజు మనో పథంలో వున్న వ్యక్తివి తప్పక నీవె.

జెర :- ఋణగ్రహీత బాధ్యత లేమిటి ?

హామా :- ఋణదాతకు వడ్డీతో చెల్లించుటయే ప్రభూ !

జెర :- మంచిది. ఋణవిముక్తుడను కావాలి.

ఉ॥ నన్నలరించి నా మదికి నచ్చిన యోఘను డుల్లసిల్ల, ము
న్నెన్నడు నెవ్వరున్ సలుపనేరని రీతిగ సత్కరింప నా
కున్నది. కానదీర్ఘముగ యోజనచేసి వచింపుమెట్టిలా
సన్నుతు సత్కరించిన యశస్సు లభించునొ? మాకు ధారుణిన్.

ఆలోచించి తెల్పుము. (లోని కెళ్తాడు.)

హామా :- (బిగ్గరగా నవ్వి) ఆహాహా ! ... ఇయ్యది నన్ను గూర్చిన ప్రశంసయే లేకున్న పే రెందుకు బయ ల్పరుపరు?... ఓయీ ! హామానూ ! నేటితో నీ యదృష్టం అందల మెక్క బోతోంది. (మందహాసంతో) మహారాణి విందు భోజనం ! ... మహా ప్రభువు లనుగ్రహించి గౌరవం ! అధమయూదుని ఉరి కంబాని కెక్కించు అనుజ్ఞ ! (నవ్వి) పొందుతాను .... ఇల్లు చేరకముందే భార్య పుత్ర మిత్రాదులు ఎదురరుదెంచి స్వాగతసత్కారాలతో ముం చెత్తుతారు ఇది తప్పక నా భోగభాగ్యదశకు పరాకాష్ఠ !. ప్రభువు లిన్నాళ్ళకు నా సేవను గుర్తించారు .... అవును నా సేవకు రాజు రాజ్యం గూడ ఋణపడియున్నారు .. ప్రభువులు ఋణశేష విముక్తుడు కావాలను కుంటున్నాడు .... నేను శత్రుశేష విముక్తుణ్ణవుతాను.... ప్రతి పౌరుడు ఆశ్చర్యసంభ్రమాలతో అదిరిపోయే గౌరవం యెన్నుకుంటాను.

అహంకారియైన ఆయూదుని నే నెక్కిన గుఱ్ఱపు కళ్లెం పట్టిస్తాను. అలంకరణ వస్తువు లన్ని ఆతనిచేతనే మోయిస్తాను చివరకు ఉరి కెక్కిస్తాను. (పండ్లు నూరి) ఓరి! మొర్దెకై ! నీ అహంకారాని కవసానదశ అతి సమీపాని కొచ్చిందిరా ! ఈ హామాను కోపాగ్నిలో శలభంవలె మలమల మాడ బోతున్నావు. ... నీ దేవుడు ని న్నెట్లు రక్షిస్తాడో చూస్తాను. ఏబది మూరలకొయ్య నీకోసం ఎదురు చూస్తోందిరా.) అటు యిటు తిరుగుచుండును.)

జెర :- (వచ్చి) ఆలోచించారా ?

హామా :- చిత్తం.

జెర :- ఎట్లు ?

హామా :- ప్రభూ ! తమరు గౌరవింప దలచిన వానికి

తే॥ గీ॥ హేమ మకుటము శిరముపై నెలమి నుంచి
పంచకళ్యాణి పైన నెక్కించి, రత్న
ఖచిత పీతాంబరాలను కట్ట జేసి
మేల్మి బంగరుతొడవుల మేన నుంచి
వందిజనములు పొగడుచు ముందు నడువ
చెలగి ఊరేగినట్లుగ జేయవలయు.

జెర :- సెభాష్ ! చక్కగా తెలిపావు ... నువు చెప్పిన దానిలో 'తు చ' తప్పకుండ చేయించుము.

హామా :- (అనుమానంగా) ఎవరికి ప్రభూ !

జెర :- రాజనగరు ద్వారమందున్న మొర్దెకై యను వానికి.

హామా :- (హతాశుడై) ఆఁ !...

జెర :- ఆశ్చర్య పడవలసిన పనిలేదు .... రాత్రి రాజ్య సమాచార గ్రంథం చదివిస్తున్నాను. నన్ను హత్యచేయ కుట్ర బన్నిన తెరెషు, బిగ్తానుల పన్నుగడను భిన్నంగావించి నా ప్రాణం రక్షించిన మొర్దెకైకు యింతవరకు ఎట్టి బహుమతి యియ్య బడ లేదని విని బహు విచారించాను .... సెహబాష్ ! మాఘనతకు తగ్గ గౌరవా న్నెంచిన నీ వివేక మతిశ్లాఘనీయం ... విందు కాగనే ఉత్సవం నడిపింపుము... పోయి సర్వం సిద్ధం చేయమని సేనాధిపతులకు కబు రంపుము.

హామా :- చిత్తం (బాధతో లోని కెళ్తాడు)

ఎస్తే :- (ప్రవేశించి) ప్రభూ ! విందు సిద్ధమైంది. సెలవా ?

జెర :- మంచిది.

ఎస్తే :- (సైగ చేయగనే హార్బోనా, హేగే, ఫలాహారాలు, పానీయాలబల్ల పెట్టి పోతారు)

హామా :- (వివర్ణ వదనంతో ప్రవేశిస్తాడు)

జెర :- రండి. మహామంత్రీ !... అంతలోనే అట్లయితిరేం ? ఇదిగో ! ఫలాహారం పుచ్చుకో.

హామా :- (తల పంకించి) శిరోవేదనగా వుంది ప్రభూ !

జెర :- అరె !... రాజవైద్యులకు కబురంపనా ?

హామా :- వలదు ప్రభూ !

జెర :- పోనీ, ఈ పానీయమైన పుచ్చుకో,

ఎస్తే :- పుచ్చుకోండి. మహామంత్రీ ! ఇది మిక్కిలి విలువైన పానీయం ! సర్వరోగసంహారిణి కూడ.

హామా :- చిత్తం (త్రాగుతూ వుంటాడు)

జెర :- (త్రాగుతు) దేవీ ! నీ మనసులోని కోరికను వినిపించుకున్నావు. విన్నటి దినాన రేపు తెల్పెదనంటివి... ఏది కోరుకో,.. అది అర్ధరాజ్యమైన అనుగ్రహిస్తాను.

ఎస్తే -: ప్రభూ !

జెర :- సంశయించుచుంటి వేల ? పారసీక ప్రభువులు బొంకువారను కొంటివా ?

ఆ॥ వె॥ పర్వతములు డుల్లిపడుగాక, వార్ధులు
పొంగి నింగి నంటి పొరలుగాక,
గతులు దప్పుగాక, గ్రహవితానం బెల్ల
మాట దప్ప నడుగుమా లతాంగి !
(అభయమిస్తాడు.)

ఎస్తే :- (నిట్టూర్చి) ప్రభూ ! నాదీన విజ్ఞాపన మేమందును ?

తే॥ గీ॥ కఠినకర్కశ దంతవక్త్రంబు తెరచి
మరణభూతమ్ము మాపైకి నురకనుండె,

జెర :- (ఆశ్చర్యంగా) దేవీ !

ఎస్తే :- చల్ల నగు నీదు కరకవచమ్ము మధ్య
నుంచి నన్ను, నావారి రక్షించు మయ్య !

జెర :- (చెవులు మూసుకొని) కర్ణకఠోరం ! చాలించు దేవీ ! చాలించు. ప్రత్యక్షర మొకశూలమై నా హృదయాన్ని చీలుస్తున్నయ్. (నిట్టూర్చి) పట్టపురాణి ప్రాణభీతితో బాధ పడుతోందా ? ... లజ్జాకరం ! (కోపంగా) పారసీక ప్రభువు: పరాభవింప నెంచిన ఆపంద యెవ్వడు !

ఎస్తే :- (దీనంగా) బానిసగా అమ్మబడిన ఇంత బాధ పడేదానను కాను. మీ కింత శ్రమ కలిగించే దాన్నికూడా కాను. నేను హతం చేయ బడటానికి అమ్మ బడ్డాను. ఏ చేతితో నన్ను లాలించి పాలించారో, ఆ చేతి ముద్రికే నా కుత్తుక నుత్తరించ బోతుంది.

జెర :- అమ్మ బడుటయా! హతము చేయబడుటయా ? ఛీ! ఛీ! ఎంత దారుణం! నా అర్థాంగి అమ్మ బడినదట, నే నెందుంటినో ? నా బహిఃప్రాణము నా ముద్రికతోనే హతము చేయబడ నున్నదట. నే నేమి చేయుచున్నానో ? .... .... అంత అయోమయంగా వుంది. దేవీ ! వేళాకోళం గాదుకదా !

ఎస్తే :- నిజం ప్రభూ! ఇదిగో! మీ ముద్రికతో వెలువడిన మాజాతి సంహరణ శాసనం ! (రాజశాసన ప్రతి యిస్తుంది.) నాకు నాజాతి ప్రజలకు ప్రాణభిక్ష దయచేయుడు. (చెంగు పట్టును.)

హామా :- (భయంతో చూస్తువుంటాడు )

జెర :- (ఉగ్రుడై) నిజమా ? ... అయితే, నా కనుగప్పి యింత నికృష్ట సాహసాని కొడిగట్టిన ఆ నీచు డెవడు ? (హామాను వైపు చూచి) హామానూ ! నీ వైన ఆ దురాత్ముని పన్నుగడలను పసిగట్టలేక పోయావా ? చెప్పు దేవీ !

తే॥ గీ॥ కన్నుగానక మీ పైన కత్తిదూసి
యున్నవా డెవ్వడో వాని యునికి యేమొ ?
తెలుపుమా! యెందునున్న నా ఖలుని యిపుడె
చీల్చి చెండాడి నీ మనోచింత దీర్తు

(కత్తి దూయును.)

ఎస్తే :- ప్రభూ !

జెర :- సంశయింతు వేల?.... వాడు మన రాజ్యపౌరుడేనా ?

ఎస్తే :- పౌరుడుమాత్రమే గాదు ప్రముఖుడు గూడ.

జెర :- ప్రముఖుడా! (బిగ్గరగా) ఎవడు వాడు

ఎస్తే :- ఈ హామానే ప్రభూ !

జెర :- (వికలుండై) ఆఁ! హామానా ? ... హామానా ! ... ఈ హామానా ?...

హామా :- (భయ విహ్వాలుడై వణకుచుండ చేతిలోని పాత్ర జారి కింద పడుతుంది)

జెర :- (ఉరిమిచూచి, పండ్లు పటపట నూరి, కిందికి పైకిచూచి, కత్తి లాగి ఒరలో విసురుగా నెట్టి, చర చర లోని కెళ్తాడు)

హామా :- (పొంగి పొరలు దుఃఖంతో)

ఉ॥ అమ్మ ! క్షమించుమమ్మ ! భవదంఘ్రి యుగమ్మును గొల్తు నీవుగా
కిమ్మహి ప్రాణభిక్ష నిడ నెవ్వఁ లే రిక, నాదు ఘోర పా
పమ్మ ఫలించె; మృత్యువు ధృఙంబు మహాప్రభు కోపదృష్టి శూ
లమ్ములు నాటె నా యెద, బలమ్ముగ; దీనుడ నన్ను గావుమా.

అమ్మా ! దురహంకారాన కన్నుగానక మీ యెడల అపరాధ మొనర్చాను. నీకాళ్లంటి మొరబెట్టు కొంటున్నాను, కరుణించు మహారాణీ !... కనుకొలకుల అగ్నికణాలు కురియుచుండ ప్రళయ కాల పర్జన్యరావం వలె పండ్లునూరి భీకరమూర్తియై మహారాజు ఉద్యానమున కరగినారు .... ఇక వారి రాక నా ప్రాణపోక .... తల్లీ ! కటాక్షించు. వారు రాకముందే నాకు ప్రాణభిక్ష దయచేయుము. (కాళ్లపై బడతాడు)

ఎస్తే :- (తొలగుచు) ఛీ దురాత్మా ! నీ కపటవేషం చాలించు. ఒకడు గాదు ఇద్దరు కాదు ఆబాల వృద్ధులుగా నాజాతి నంతను నాశనం చేయ సంకల్పించిన నీ దురాగతానికి క్షమా పణ ముందా ? నీ ప్రాణభీతి నిన్నెంత కలవర పెడుతుందో, అందరి స్థితి అటువంటిదే నని ఎందు కనుకొనక పోయావు ?

హామా :- (ఏడ్చుచు) తెలియక పరాధ మొనర్చాను క్షమించుతల్లీ!

ఎ_స్తే :- ఏది తెలియదు? యూదులకు ప్రాణముండునని తెలియదా? వారికి పసికందు లుందురని తెలియదా? భర్తలను నరుకుచుండ భార్యలు విలపిస్తారని, భార్యలను చెర గొనుచుండ భర్తలు బాధపడతారని తెలియదా? ఆ క్రూర శాసనం చూచిన దాది, ప్రతి యూదుడు కన్నీరు పానీయంగా, కటిక దుఃఖమే ఆహారంగా ఉన్నారని తెలియదా? తొలగు? నా దారి కడ్డురాకు.

హామా :- (దుఃఖవివశుడై) తొలగను. నను కరుణించువరకు తొలగను. నాకు, నా కుటుంబానికి ప్రాణదాన మొనర్చే వరకు తొలగును?

ఎ_స్తే :- నే నంతటి సమర్థురాలనా?

మ॥ ఘనతన్ జెందిన మంత్రిశేఖర! యశోగంభీరుడా! నన్ను, నా
జనులన్ లక్షల జెండితో గొనన ఐశ్వర్యాధిపా! యేటి కిం
కను మ మ్మింగతి గేలిచేసెదవు? లక్షల్లేవు మా పొంత నే
మన్నింప సమర్థురాలనె? ఇసీ! నే బానిసన్ గానొకో.

హామా :- (అడ్డంగా పోవుచు) న న్ననుగ్రహించు వరకు విడువను ఈ ఒక్కసారి ఈ దీనుని కటాక్షించు.

జెర :- (ప్రవేశించి ప్రక్కగా నిల్చుండును)

హామా :- (బతిమలాడుచు) చిరకాలం నీ సేవచేస్తాను ప్రభువులు వచ్చులోపల "సరే" అను. నే ధన్యుణ్ణవుతాను... లేనిచో నాజన్మ శూన్యమే.

ఎస్తే :- ఛీ! కళ్లు మూసుకొని పైపైకి రాకు. (లేచి పో బోవు చుండగా హామాను అడ్డంగా పోయి)

హామా :- న న్ననుగ్రహించు వరకు విడువను.

జెర :- (ఉగ్రుడై, ప్రతిధ్వనించునట్లు) రే! దురాత్మా! స్వామి ద్రోహీ! మదోన్మత్త ప్రలాపీ! ఏరా? నీ కండకావరం! పాలుబోసి పెంచిన పామువలె నాకే కీడు తలపెట్టావ్ ... ఛీ! నీ ముఖం చూడరాదు నా మందిరాన నాకమక్షం లోనే పట్టపుదేవిని పరాభవించ దలంచిన నీ కిదే తుట్ట తుది గడియ. (సైగ చేయును. ఇరువురు భటులు నల్లగుడ్డతో హామాను ముఖం కప్పుతారు.) ఈ దురాత్ముని కొనిపోయి తలారి కప్పగించి తల దీయించుడు.

హార్బో :- ప్రభూ! మొర్దెకైని ఉరిదీయించాలని ఇతడు తన యింటి యొద్ద యేబది మూరల స్తంభం నాటించాడు.

జెర :- (నిట్టూర్చి) ఎంత విద్రోహి! ... అటు లయిన ఈతనిని ఆ కొయ్యపై నే ఉరిదీయుడు.

(భటులు హామానును బంధించుచుందురు.)

జెర :- (ఎస్తేరుతో) దేవీ! మనశ్శాంతి నొందుము. హామాను కుటుంబాన్ని నీ వశం చేస్తున్నాను ... ఇంక యేమైన ...

ఎస్తే :- ప్రభువులు కటాక్షింతురుగాక ... శాసనాన్నికూడ రద్దు చేయించి నా ప్రజల నుద్ధరించ ప్రార్థన.

జెర :- (ఆలోచించి) రాజశాసనాన్ని మార్చుట? నా ముద్రిక పడిన శాసనం రద్దగుట అసంభవం.

ఎస్తే :- (భయంగా) అసంభవమా ? ....

జెర :- భయపడకు. దానికి ప్రతి శాసన మొకటి పుట్టింతము. దానితో చిక్కు విడిపోగలదు.

ఎస్తే :- (మోకరించి) ధన్యురాలను.

జెర :- (లేపుచు) లే! అవిగో! మంగళ తూర్యారావాలు ... మొర్దెకైనూరేగిస్తున్నారు. మేడపై కేగి చూతము పద.

ఎస్తే :- చిత్తం (లోని కెళ్తారు.)

(హామానును భటులు లాక్కొని పోవుచుండగా

(నేపథ్యం నుండి)

ఆ॥ వె॥ పరుని చంప నురిని పన్నను. కాని ఆ
ఉరియె అతని గళము నొడిసి చుట్టె
సర్వలోక కర్త స్వామీ ! యెహోవ ! నీ
తలపు లెరుగ నెవరి తరము దేవ !

[ తెర ]



# 9 రంగము

## షూషను కోట వీధి

హేగే :- ఒహోయ్. వినండి. మహాప్రభువుల అనుగ్రహం పొందిన వారికి ఇలాగే సన్మానం జరుగుతుంది. ... మొర్దెకైకి జే!

మొర్దె :- (సర్వాలంకార శోభితుడై ప్రవేశిస్తాడు)

నేపథ్యంలో :- పాట

పరమదేవుని చరణసేవయె
శరణమని దురితమ్ము నంటక
పరులు సైతము సోదరులుగా
నరసి ధరణి చరించు వారికి,
విజయ మకుటం దివ్యదీప్తుల
వేచి వుంటుందోయ్.

హేగే :- మొర్దెకైకి జే!

(లోని కెళ్తారు)

(రెండవ ప్రక్కనుండి)

హార్బో :- పద! పదరా దుర్మార్గుడా! (తోటిభటునితో) లాగు. (నల్లని ముసుగు చేతులకు సంకెళ్లు వేసి హామానును హతాకు లాగుతు వస్తాడు.)

హార్బో :- (కొట్టి) మొర్దెకై కోసం, యాభై మూరల ఉరికొయ్య బాతించి వచ్చాడీదుర్మార్గుడు.

హతాకు :- (నవ్వి) అందుకే తను తవ్వుకొన్న గోతిలో తనే పడ్డాడు.

(నవ్వుతారు.)

హార్బో :- పద. (కొడతారు)

నేపథ్యంలో :- పాట

కుల ద్వేష పిశాచరాజుకు
కొలువు సేయుచు తోటినరులను
నీచ జంతువులట్లు చుర చుర
చూచి దూరము నెట్టువారికి
మరణ కూపం నోరు తెరచి
మాటు కాస్తుందోయ్.

హాతాకు :- పద (లోపకెళ్తారు.)

(మరియొక ప్రక్కగా.)

హేగే :- మొర్దైకైకి జే ! మొర్దైకైకి జే !( మొర్దైకై ప్రవేశిస్తాడు.)

నేపథ్యంలో :- పాట

మొక్కవోవని ఓర్మితో ప్రభు
డొక్కడే దిక్కనుచు శ్రమలను
లెక్కచేయక దైవమును భయ
భక్తులతో భజియించు వారికి
విజయమకుటం దివ్యదీప్తుల
వేచి వుంటుందోయ్. (లోని కెళ్తారు)

(మరియొక ప్రక్కనుండి.)

హాతాకు :- పద ! (కొరడాతో కొట్టుచు) వీడి జాతిదప్ప ఎవుడి జాతి బతకూడదట.

హార్బో :- అ బుద్దే వీడి కీగతి దెచ్చింది. (నవ్వు)

నేపథ్యంలో :- పాట.

పదవి గలదని విఱ్ఱవీగకు
ప్రభుని పదమే పారమార్థము
దురధికారముతోడ పరులకు
ఉరుల నొడ్డే వారి కొఱకై.
క్రూరపాశం నోరు తెరచి
దారి కాస్తుందోయ్.
(లోని కెళ్తారు)

హేగే :- (మఱియొక ప్రక్కనుంచి) మొర్దెకైకి జే!

(మొర్దెకై ప్రవేశించగా చక్రవర్తి ఎ స్తేరు ఎదు రౌతారు. చక్రవర్తి మొర్దెకైని కౌగలించు కొంటాడు.)

జెర :- మొర్దెకై! మీకు, మీ జాతికి సంభవించిన విపత్తును పటాపంచలు చేయగలిగిన నీ భక్తి ప్రశంసనీయంసుమా.

మొర్దె :- క్షమింతురుగాక, ఇది నా భక్తి శక్తిగాదు దైవ సంకల్పం మహాప్రభూ! కాకున్న,

సీ॥ న్యాయమూర్తులు మీకు నా యొనర్చిన పని
మరచిపోయినదాని తెరగు చూడ
మరచిపోయితిరి పో, తిరిగి యా విషయమ్ము
గతరాత్రియే తాము గనుట చూడ
నన్నురి వేయింప నాజ్ఞ పొందగవచ్చి
వడి నందు హామాను పడుట చూడ
తన కంచు నెంచిన ఘనత లన్నియు నాకు
దక్కిన ఈ గొప్పతనము చూడ
ఇది నరుల పని కానేకా దెంతమాత్ర
మిది యెహోవ సంకల్పమే యెంచిచూడ,
ఆయనే నమ్ముకొనువారి నద్భుతముగ
కాచి రక్షించు దైవమ్ము క్ష్మాతలేంద్ర!

జెర :- (మందహాసంతో) హుఁ హుఁ! ... కుటిల జాతిద్వేషం ఆతనికి నాశనం దెచ్చింది. పటుతర సహనం మీకు విజయ(శ్రీ)నిచ్చింది ... ఏ దేమైన నేటినుండి నీవు నా సచివుడవు.

(భటుని సైగచేసి టర్బను తెప్పించి తలపై నుంచుతాడు.)

మొర్దె :- మహాప్రసాదం.

జెర :- దేవీ ! జాతిక్షేమం. శత్రుసంహారం నీకొనగూడినయ్
ఇంక నేమైన కోరికలు ?

ఎస్తే :- ప్రభూ !

తే॥ గీ॥ పాడిపంటలు, సౌఖ్య సంపదలు, శాంతి
భద్రతలు, సదాచార సద్భక్తి విధులు
సలలిత కళాభ్యుదయములు, కలుగుగాత !
ఉర్వి: సర్వేజనా స్సుఖినోభవంతు,

[ తెర ]

మంగళమ్ ! మంగళమ్ !! మంగళమ్ !!!



# అనుబంధములు.

మొర్దెకై :- 1వ అనుబంధం (25 పుట)

రాగం : చక్రవాకం తాళం : ఆది

ప్రభూ!...

నీ చరణమె మా శరణం
నిఖిలలోక జీవన !
నీ ధ్యానమె మా ప్రాణం
విశ్వ మూల కారణ !

(1) వెతల కతల సతమతమై
నుతియించిన మా పితరుల
అతులిత ప్రేమను గాచిన
నుతప్రభావ ! దేవ ! దేవ ! ||నీచరణమె||

(2) అనయము నీ నామ భజన
మున తరియించెడు మనుజుల
కనులలోన దాచికాచు
ఘన యెహోవ ! దేవదేవ ! ||నీ చరణమె||

బైరాగి : 2. అనుబంధం (31 పుట)

రాగం : కళ్యాణి తాళం : ఏక

సాకీన్ : హే భంబు భంభా ! ... హే భంబు భంభా !

చరణం: భం భం భంభం భంబా ! .... భంభం భంభం భంబా !

1 సాకీన్ : కామము కడుపాప పంటారా పెద్దలు – అరగంటితో
కామినుల చూస్తుంటారా ప్రబుద్ధులు ....

చరణం: నీతులు చెప్పుతు గోతులుతీసే వారున్నారోయ్ భంబా !
(2వరకు) కల్లబోధలకు కాలం జెల్లగ – తెల్లమొగాలేస్తారోయ్
చల్లగ ||భంభం||

2 సాకీన్ :- కాషాయగుడ్డలు కట్టినవారంత - కర్మయోగులు
కారురా అంగీలు దాల్చిన వారంత సర్వసంగ పరిత్యాగులు
కారురా

చరణం :- తలలు బోడివైనంత మాత్రమున భంభా! బలిసిన వసీగల
గుట్టాలై-తలపులు పరుగులు తీయుచుంటయా ॥భంభం॥

3 సాకీన్ :- పదవుల కోసం గుద్దులాటలు వద్దురా నాన్నా !
ఆ పరమ గురుని పదంకోసం ప్రాకులాడరా చిన్నా !
(తెరెషు, బిగ్గానులు తెల్లబోయి చూస్తుంటారు)

చరణం :- పదవుల కోసం కీచులాటలో -బాధ్యత మరువకు భంభా !
మీ తగవులు తెస్తయితంట - అవివోంటికి మంచిదిగాదంట
॥భంభం॥

మొర్దెకై & బృందం 3. అనుబంధం (52 పుట)

రాగం : శివరంజని తాళం : రూపకము

బృందం, సాకీన్ :- ఓ ఓ దేవ దేవా ! .... ఓ ఓ చమూనాధా !
మా యెహోవా ! వేగరావా !

1 మొర్దె:- ఏమిటయ్యా యింతఘోరం
స్వామి యేమిటి మాదునేరం
నీదుచరణాబ్జముల నమ్మిన
బిడ్డలమె ఈ శిక్ష తగునా !

బృందం :- ఓ ఓ దేవదేవా ! ఓ ఓ చమూనాధా !

2 మొర్దె :- ఒక్కనాడె నీదుబిడ్డలు
ఉక్కడింప బడగనుండిరి
ఎక్కడుంటివి ఆ త్తరక్షా !
యెందులకు ఈ ఘోరశిక్షా !

బృందం :- ఓ ఓ దేవ దేవా ! .. ఓ ఓ చమూనాధా !

3 మొర్రె :- తల్లిబిడ్డల గోడు యెంతని
వెల్లడింపను మా యెహోవా!
తొల్లి మా పితరులకు చూపిన
చల్లని దయచూప రావా

బృందం :- ఓ ఓ దేవ దేవా! .... ఓ ఓ చమూనాథా!

4 మొర్రె :- క్రూరరాక్షస శాసనము మము
క్రుంగ దీసెను మా యెహోవా!
దారి నీవే యిపుడు యింకే
దారి లేదో దేవ దేవా!

బృందం :- ఓ ఓ దేవ దేవా! ఓ ఓ చమూనాథా!

ఎ స్త్రీలు :- 4. అనుబంధం (52 పుట)

రాగం :- తిలకామోదు తాళం :- త్రిపుట

ఈ వన మతిసుందరము - ఆనందాల నిలయము

1. మామిడి చిగురుల మెక్కుచు
ఆమని ఆగమన గీతి
మధురముగా పాడుచున్న
ముదుకు కోయిలమ్మ లున్న || ఈవనం ||

2. ఝుంకరించి పల్లటీలు
సల్పుచు పూబూవు తిరిగి
మకరందము త్రావి త్రావి
మత్తిలు ఎలదేటున్న || ఈవన ||

3. వివిధ వర్ణరంజితమై
విరజిమ్మెడి పరిమళాల
పరవశింప జేయు విరులు
దరహాసము సల్పునట్టి || ఈవన ||

ఎ_స్తేరు :-　　5 అనుబంధం　　(64 పుట)

రాగం :- హిం. తోడి　　తాళం :- ఆది

ఏమి జరిగెనో గదా?
ఇంతలోన అంత ప్రళయ　　|| ఏమి ||

1. పగలు రాత్రులనక నీదు
పాదభజన విడనివాడు
దిగులుతోడ వీధికెక్కి
హేతువేమొ దేవదేవా !　　|| ఏమి ||

2. గోనె బట్ట దాల్చెనట
బూదిని మై బూసె నట
ఈ విషాద రూపమ్మును
హేతువేమొ దేవ దేవా !　　| ఏమి |

ఎ_స్తేరు & జెరక్సస్ :-　　6. అనుబంధం　　(68 పుట)

రాగం :- కళ్యాణి　　తాళం : ఆది

ఎ_స్తేరు :- గిలిగింత లిడెడు భానుకిరణ దీప్తి లేమిచే
కళమాసినళిని కాంతమోము వాడెనో ప్రభూ? |గిలిగింత|

జెర :- తెల తెల్లవార సాగెనదే ప్రాగ్దిశా సతీ
వలిపంపు చీరగట్టి వేగవచ్చెనో ప్రియా　　| తెల తెల్ల||

ఎ_స్తేరు :- వెలిగించు దివ్యదీప్తులతో మమ్ములను ప్రభూ
తొలగించు కమ్ముకొన్న కటిక చీకటుల ప్రభూ | వెలిగించు|

జెర :- మదినింక కలత లేల మనోశాంతి నందుమా:
ఉదయించనుండె బాలభానుడదిగో ప్రియతమా! |మది

